ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్



Like us to follow
@mohanpublications




- శ్రీ వేంకట చలపతి

# బాల భారతము



# బాలభారతము.

for favour of [illegible] review
[illegible] in the University.

[illegible] పంతులుగారు, బి. ఏ., ఎల్. టీ.



ప్రకాశకులు

నా. రంగారావు,

రాజమహేంద్రవరము.

1926

సర్వస్వామ్యసంకలితము | [వెల రు. 0-14-0 లు.

# పీఠిక.

---

మహాభారతమునకు గల భారతసంగ్రహము లందుఁ గొన్ని యతివ్యాప్తము లగుటవలనను గొన్ని యతిసంగ్రహము లగుటవలనను యువజనులకంత హృదయరంజకములు గా నున్నవి. ఈలోపముఁ బాపఁదలఁచి యీబాలభారతము రచించితిని.

శ్రీ మహాభారతము ప్రపంచమందు జనించిన యితిహాసములలో నెల్ల శ్రేష్ఠమని పాశ్చాత్యులు గూడఁ జెప్పెదరు. దానిం గవిత్రయమువారు తెనిఁగించి మిగుల మేలొనరించిరి. ఆగ్రంథమునందుఁ గొంతఁ జవిఁగలిగింప దీనం బ్రయత్నించితిని.

ఈగ్రంథమంతయుఁ దుదముట్టవిని యందందుఁ జాలిన పరుషపదముల సూచించి సన్మానందింపఁ జేసినందులకు నా మిత్రవర్యులు జనమంచి వేంకటరామయ్యగారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఇన్నీసుపేట
రాజమహేంద్రవరము
28-5-1922

ఇట్లు
బుధజనవిధేయుఁడు
ధేరం వేంకటాచలపతిగారు బి. ఏ. ఎల్. టి.

దుంధుభి జ్యేష్ఠశు ౨ ఆదిత్య.

# విషయములు.




| | | |
|---|---|---|
| 1. | చంద్రవంశము. | |
| 2. | పాండవజననము. | 6 |
| 3. | హస్తినాపురవాసము. | 1[illegible] |
| 4. | బకహిడింబులు. | [illegible]2 |
| 5. | ద్రౌపదీస్వయంవరము. | 30 |
| 6. | ఇంద్రప్రస్థము. | 36 |
| 7. | అర్జును నభ్యుదయము. | 3[illegible] |
| 8. | ఖాండవదహనము. | 44 |
| 9. | యుధిష్ఠిరుని వైభవము. | 47 |
| 10 | రాజ్యభంగము. | 5[illegible] |
| 11. | అరణ్యవాసము. | 6[illegible] |
| 12. | అజ్ఞాతవాసము. | 71 |
| 13. | అజ్ఞాతవాసావసానము. | 79 |
| 14. | సంధి. | 88 |
| 15. | మహాసంగ్రామము. | 9[illegible] |
| 16. | దుర్యోధను సంత్యజించె. | 10[illegible] |
| 17. | పెద్దల పరమపదప్రాప్తి. | 10[illegible] |
| 18. | పాండవుల స్వర్గారోహణము. | |

చాటింప భీష్ముఁడును బోయి రాజులందఱుఁ జూచుచుండ నంబికాయంబాలిక యను కన్యకలను రథముపై నెక్కించుకొని యడ్డమువచ్చిన రాజులనందఱ నోర్చి తెచ్చి విచిత్రవీర్యునకు వివాహముచేసెను.

అంబికాంబాలికలు బహుసౌందర్యవతులు. విచిత్రవీర్యుఁడు వారియందమున మోహపరవశుఁడై రాజ్యముమఱచి వారలతో నుద్యానవనములందును, నదీతీరములందును విహరించుచుండెను. ఆచాపల్యమువలన నతనిశరీరము దుర్బలమై యనతికాలమున నాతఁడు మృతినొందెను. ఆహా! భరతవంశమున కెట్టిగతిపట్టినది! భీష్ముఁడు శాశ్వత బ్రహ్మచర్యవ్రతముఁ బూనెఁగదా! విచిత్రవీర్యునకు సంతతి లేదు. చిరప్రఖ్యాతమగు నాచంద్రవంశ మంతమగునటుల దోఁచెను. అప్పుడు సత్యవతి భీష్మునిఁబిలిచి "తండ్రీ! నేనొకమాట చెప్పెద వినుము. దేవరన్యాయమున నీమఱదండ్రయందు సంతానముఁగలిగింపుము. ఇది ధర్మశాస్త్రము లొప్పినపద్ధతి" యనెను. భీష్ముఁడు తల్లి చెప్పినను బ్రహ్మచర్యవ్రతమును చెఱపికొననిష్టపడక "తల్లీ యటులగాదు. ఉత్తమ క్షత్రియక్షేత్రములందు బ్రాహ్మణులవలనఁబుట్టి వంశకరులైన రాజులనేకులుగలరు.

"క. కావున నియుక్తాత్ముఁ జగ
త్పావను సత్త్వస్వరూపు బ్రాహ్మణుఁ బడయం
గావలయువాఁడు సంతతిఁ
గావించు విచిత్రవీర్యు క్షేత్రములన్."

అని చెప్పెను సత్యవతియు నిదియె యుక్తమని తలఁచి వేదములను విభాగించిన మేధాశాలియు, సకలధర్మార్థవేదియు మునిశ్రేష్ఠుఁడునగు వ్యాసునిఁ బిలిపించి తనయభిప్రాయము కోడండ్రతోఁ జెప్పెను. అందుఁ బెద్దదియగు నంబిక మునీశ్వరుని జడలు, బిరుసుగడ్డము నాఃబట్టలుఁ జూచి భయపడి కనులుమూసికొని యాతనిదగ్గఱకుఁ బోయెను. అందుచే నామెకుఁ బుట్టినకుమారుఁడు గ్రుడ్డివాఁడయ్యెను. సత్యవతి మిగుల విచారించి యంబాలికను నియోగింప నామెయు ఋషిమొగమును జూచి తెల్లఁబోయెను. అందుచే దానికి జనించిన పుత్రుఁడు పాండురోగివలెఁ దెల్లనై యుండెను. సత్యవతి దుఃఖించి యంబికను మరల ఋషిదగ్గఱకుఁ బొమ్మనెను. అందులకామె యిష్టపడక తనదాసినలంకరించి పంపెను. దానికి విదురుఁడను నొకకుమారుఁడు పుట్టెను. అంబికాకుమారునకు ధృతరాష్ట్రుఁడనియు, నంబాలికాసూనునకుఁ బాండుఁడనియు నామకరణ మొనరించిరి. వ్యాసుఁడును "వీరు ధర్మవేత్తలును, శౌర్యవంతులు నీతివిశారదులగుదురు. ఈకుమారుల బాగుగ రక్షింపుఁడని" నియమించి తనతపోవనమునకుఁ బోయెను. నాఁటినుండియు వ్యాసునకీవంశమున సభిమానము కుదిరెను.

# రెండవప్రకరణము.

---

## పాండవజననము.

పాండుధృతరాష్ట్రులు పెద్దవారగునంతకు భీష్ముఁడే పరిపాలనఁ జేయుచుండెను. ఆతని రాచఱికమున దేశము సుభిక్షముగ నుండెను. ప్రజలును సుఖముగ నుండిరి. శాస్త్రవిషయమునకు భీష్మునిఁబోలిన నీతిశాలి వేఱు. న్యాయసభకుఁ బనియును లేదు.

ఇట్లుండ రాజకుమారులకు యౌవనము వచ్చెను. వారికి వివాహముఁ జేయవలయునని భీష్ముఁ డాలోచించుచుండెను. గాంధారదేశాధీశుఁడగు సుబలునకు గుణవతియగు నొక కూఁతురు గలదు. దానిం దెచ్చి ధృతరాష్ట్రున కాతఁడు వివాహము చేసెను. మఱియు నామెతోఁ బుట్టువులగు మఱి పదుమందికన్యల నొకసహార్యముననే యాతని కిచ్చి పెండ్లి చేసిరి. రెండవవాఁడగు పాండునృపునకు వివాహమునకుఁ దగిన సంబంధమునకై నిరీక్షించుచుండఁ గుంతిభోజుఁ డనురాజు తన కుమారికి స్వయంవరము చాటించెను. కుంతిభోజునకుఁ గొమార్తెలు లేనందున యాదవరాజగు శూరసేనుని కూఁతు నాతఁడు పెంచికొనెను. ఈస్వయంవర మామెదే. ఆమె పేరు కుంతి. ఆకన్యను స్వయంవరసమయమున నంబికాంబాలికలఁ దెచ్చినటుల తెచ్చి భీష్ముఁడు పాండునకుఁ బెండ్లి

చేసెను. ఈవివాహ మైనతరువాతఁ బాండురాజు మద్రరాజ కుమారి మాద్రి యనుదాని నింకొకతెనుఁ గూడఁ బెండ్లియాడెను. ధృతరాష్ట్రుడు పెద్దవాఁడైనను జాత్యంధుఁ డగుట వలన రాజ్యార్హుఁడు కాకపోయెను. కావునఁ బాండుఁడు రాజయ్యెను. అయిన నతనికి సోదరునందుఁ గల యభిమానముచేఁ బాలనమంతయు ధృతరాష్ట్రుని పేరనె చేయుచుండెను. మఱియు,

"చ. వినుతయశుండు పాండునృపవీరుఁడు దిగ్విజయంబుఁ జేసి పెం
పున గొనివచ్చి యిచ్చినయపూర్వమహాధనరాశి పేర్మివా
రనిధిభరంబుతోడ ధృతరాష్ట్రుఁడు చేసె శతాశ్వమేధముల్
దనరఁగ భూసురేశులకు దక్షిణ లిచ్చి యథోచితంబుగన్."

ఆపాండురాజొకనాఁడు వేఁటకుఁ బోయెను. వానితోఁ గుంతియు మాద్రియు వెళ్ళిరి. పాప మారాజరణ్యమంతయుఁ దిరిగెను. కాని యొక్కమృగమైన వానికిఁ జిక్కినది కాదు. తుదకొకచోట విహరించుచున్న మృగమిథునముఁ జూచి దానిపైఁ దనబాణము వదలెను. ఆశరము తాఁకినతోడనది నేలఁగూలెను. పాండురాజును వానిం గొనిపోవఁదలఁచి దగ్గఱకుఁ జనినంత నందు మగలేడి మనుష్యవాక్యములతో నిట్లనెను. రాజా! మేము మునిదంపతులము. మృగములవలె సంచరింపఁ గుతూహలము కలిగి యిట్టు లుంటిమి. రాజులకు మృగములను వేఁటాడి చంపుట న్యాయమె యైనను సుఖప

రవశత నున్నవానిం జంపరు. ఇట్టి యధర్మముఁ జేసితివి కావున నీవును గాంతాసమాగమ మైనపుడు చచ్చెద వని శపించి ప్రాణములు వదలెను.

ఎంతపని జరిగినది! నిష్కారణము ప్రాణివధయైనది. అందును మునిదంపతులు! పాండురాజునకుఁ బ్రాణము నొచ్చెను. ఇంత మహాపాపముచేసి రాజ్యమేలుట యేల? సర్వభోగములను వదలి యాతఁడు బ్రాహ్మణులతోఁ గలసి తప మొనరింప నెంచెను. అతనిభార్యలును సమస్తభూషణము లుజ్జగించి నారచీరలుగట్టి తమపతి ననుసరించిరి. ఈసమాచారము భీష్మవిదుర ధృతరాష్ట్రులకుఁ దెలియఁజేసి పాండురాజును భార్యలు నుత్తరాభిముఖులై నడచిరి. క్రమక్రమముగ వారు హిమాలయమును దాటి గంధమాదనమును వదలి మఱియు నావల శతశృంగమునకుఁ బోయిరి.

శతశృంగమున నున్న సమయమునందు భూపతికి సంతానము లేకపోయె నను విచారము పుట్టెను. తుదకాతఁడు కుంతిం బిలిచి 'దేవీ! సంతానము లేనివారలకుఁ బితౄణము తీరదు. అందుచే ముక్తి లేదు. నావలన సంతానము కలుగదు గదా. కావున, నీవు దేవరన్యాయమునఁ గుమారులఁ బడయుము' మని నియమించెను. కుంతి యందులకు సమ్మతింపక "నాథా! యాదవముఖ్యుఁ డగు వసుదేవుని చెలియలనై మీకుభార్యనై పరునకు సంతానముఁ గనుటకు నాకిష్టము

లేదు. దేవతల నారాధించి వారలవలన వరములు పొంది సంతతిఁ గనెదననెను. అటులనె యామెయు యమునివలన యుధిష్ఠిరుఁడును, వాయుదేవునివలన భీముఁడు, నింద్రునిచే నర్జునుఁడుఁ గలిగిరి. మాద్రి యశ్వినులఁ బ్రార్థింప నకులసహదేవులు పుట్టిరి. పాండురాజు తపోవనమునకుఁ జనిన వెనుక ధృతరాష్ట్రుఁడు రాజుగా దేశము భీష్ముఁడు పాలించుచుండెను. ధృతరాష్ట్రునకును భీముఁడు పుట్టిననాఁడె యొకకుమారుఁడు జనించెను. వాని పేరు దుర్యోధనుఁడు. అటుపైనా యంధనృపతికి మఱి తొంబదితొమ్మండ్రు కుమారులు నొక కొమార్తెయుఁ బుట్టిరి.

ఇటులుండ నట శతశృంగమున నొకసంవత్సరము పాండురాజు బ్రాహ్మణసంతర్పణము చేయఁదలఁచెను. కుంతియు నాప్రయత్నమున నుండెను. అప్పుడు వసంతకాలము భృంగగీతములతోఁ గోయిల కూతలతో శీతలవాతపోతములతో వనమంతయు నూతనజీవముతోఁ గలకలలాడుచుండెను. మాద్రియు నవపుష్పమంజరుల నలంకరించుకొని యతనికిఁ జేరువనుండెను. నాఁడు పాండురాజునకు మాద్రియందము డెందము గదలించెను. ఆమెను మొదట వివాహసమయమునఁ గాంచినప్పటి యనురాగము కొంత యుప్పొంగి యాతఁడు తటాలున లేచి యామెను ముట్టుకొనెను. మాద్రి భయపడి ,,నాథా ! వలదు వలదు మునిశాపము'' అని యడ

చెను. అంతలో నాతఁడు నేలఁ గూలెను. ఇఁక నేమున్నది! పాండురాజు చనిపోయెను !

మఱియు బ్రాహ్మణులును వచ్చి ఋషులు శోకించిరి. మాద్రి సహగమనమునకు సిద్ధమయ్యెను. కుంతియుఁ బతి ననుగమింపఁబోవ ఋషులు "తల్లీ! నీ యీ తలంపు మానుమా! నీవు పోయిన పిల్లలఁ గాచువా రెవరు?" అని వారించిరి.

# మూఁడవ ప్రకరణము.

---

హస్తినాపురవాసము.

శతశృంగమునఁ దపస్సుచేయుచున్న మునులకందఱకుఁ బాండుభూపాలునియందు విశేషమగు తాత్పర్యము కలదు. మహారాజైనను భోగములవిడచి తమతోఁ బాటు వనమునందు నివసించిన యాతనియందు వారికి గౌరవముండుట న్యాయమే కదా. మఱియు నాతఁడు చనిపోయినందునఁ దమ యనురాగమంతయు నతని సుతులయందుఁ జేర్చిరి. వారికి విద్యాబుద్ధులు గఱపిరి. ఉపనయనము చేసిరి. వేదాధ్యయనము చేయించిరి. పాండవులందఱిలోఁ బెద్దవాఁడగు యుధిష్ఠిరునకుఁ బదునాఱు సంవత్సరములు వచ్చెను. ఇఁక వీరిని హస్తినాపురమునకుఁ గొనిపోయి బంధువుల కొప్పగించుటయే మంచిదని తలఁచి వారు కుమారులను గుంతిని దోడ్కొని ధృతరాష్ట్రుని మందిరమునకు వచ్చిరి.

అప్పుడా భూసురులు పాండవుల జన్మప్రకారమును పాండుభూపతినిర్యాణమును ధృతరాష్ట్రునకుఁ దెలియఁజెప్పి కుమారుల సంరక్షించుమని యాజ్ఞాపించి తమ యాశ్రమములకుఁ జనిరి.

ధృతరాష్ట్రునికుమారులును పెద్దవారగుచుండిరి. దుర్యోధనుఁడు పదునైదుసంవత్సరముల వయస్సుగలవాఁ డయ్యెను. అప్పటికి వానిచాపల్యములను భీష్ముఁడు విదురుఁడు మొదలగువారు వానిని గంటికిఁ గాచుకొనుచుండిరి.

కుంతియుఁ బాండవులును వచ్చిరని తెలిసి వ్యాసుఁడు వారిని జూడవచ్చెను, ఆసమయమున నామునిసత్తముఁడు సత్యవతిం గాంచి "అమ్మా! దుర్యోధనుఁడు దుష్టుఁడు మిగు లసూయాపరుఁడు. పాండవులును వచ్చిరి. గృహకలహములు నింకఁ బెరుగును. మీరింక నాశ్రమవాసము చేయవచ్చు" నని చెప్పెను. సత్యవతి యామాటను విని యాతనితోఁ దపోవనమునకరిగెను. అంబికయు నంబాలికయు వారి వెంట నేఁగిరి. ధృతరాష్ట్రుఁడు తనకుమారులను పాండునందనులను జూచి మహానందమునఁ గాలముఁ గడపుచుండెను. వారలకు రాజోచితవిద్యలఁ జెప్పించుచుండెను. భరద్వాజమహర్షి కుమారుఁడగు ద్రోణాచార్యుఁడు బాలురకు శస్త్రాస్త్రసాధనములు తెలుపుచుండెను. కౌరవకుమారులతోఁ బాటుగ భరతఖండమునందలి నృపనందనుల నేకులు వచ్చి ద్రోణుని చెంతఁ జదువుచుండిరి. పాండుకుమారులు నానాఁటికి విద్యాభ్యాసంగమున నద్వితీయులగు

చుండిరి. అదియుంగాక యాటలయందు సైతము దుర్యోధనాది ధార్తరాష్ట్రులు వారిసాటి గాకుండిరి ఇదియంతయుఁ జూడఁ జూడ దుర్యోధను చిత్తము వ్యాకులమగుచుండెను. అందును భీముఁడనిన నాతనికి నసూయ చాలఁ బెరుగుచుండెను.

ఎట్లైన భీమునిఁ జంపవలయునని యతఁడు ప్రయత్నించెను కాలు సేతులుఁ గట్టించి గంగలోఁ బడవైచెను. పాములఁ దెప్పించి కఱపించెను. విష మన్నమునఁ గలిపి పెట్టించెను. ఎన్ని చేసిన నవి వ్యర్థములయ్యెను. నీటిలోఁ బడవేయించినప్పుడు కట్లు తా త్రెంచుకొని వెడలుకొని వచ్చెను. పాములు వాని చర్మమునైన గీఱలేకపోయెను. విషము జీర్ణమయ్యెను! ఇఁక నేమి చేయఁగలఁడు.

భీమసేనుఁడును మిగులఁ బలాఢ్యుఁడుగఁ జరుగుచుండెను. అతని విద్యాగ్రహణశక్తియు, బుద్ధితీక్ష్ణతయుఁ ద్రోణుఁడు చాల సంతోషించి వానినిఁ దనప్రియశిష్యునిఁ జేసికొనియెను. కొలఁది కాలములోనె నృపనందనులందఱుఁ బుద్ధిసంపన్నునితో సమానుఁడగు విలుకాఁడు లేఁడనిపించెను.

ద్రోణుఁడు తనశిష్యుల విద్యాప్రభావము పెద్దలకుఁ జూపవలయునని కుతూహలము పుట్టి తనకోరిక ధృతరాష్ట్రునితోఁ జెప్పెను. ధృతరాష్ట్రుఁడును సంతోషించెను. కుమారుల యస్త్రవిద్యాప్రకటనమునకుఁ దగునట్టుల పెద్దరంగస్థలము సిద్ధము చేయించెను. అందుఁ జూడవచ్చిన వారలకు స్థలము నంతఃపురజనులకు ప్రత్యేకభాగమును మంత్రిహిత బంధువులు

కర్ణునిఁ జూచినతోడనే దుర్యోధనునకుఁ బ్రాణములు లేచివచ్చెను. వీనితో స్నేహము చేసిన నర్జునుని నెదిరింపవచ్చునుగదా! అంత దుర్యోధనుఁడు లేచి "కర్ణుఁడు మహాపరాక్రమశాలి. అందుచే రాజగుటకు యోగ్యుఁడు. అదియుఁగాక వీనికంగరాజ్యమిచ్చి రాజును జేసితి" నని యప్పుడే జలము దెప్పించి వాని కంగరాజ్యాభిషేకము చేసెను. కుమారునకుఁ బ్రాప్తించిన వైభవమునకు సంతోషము పట్టజాలక సూతుఁడు పరుగెత్తి వచ్చి కర్ణుని గౌఁగిలించుకొనెను. అప్పుడు భీముఁడు నవ్వుచు "నీకులమిప్పుడు తెలిసినది. చబుకుపట్టి రథముతోలఁదగిన వాఁడవు నీవు! నీకంగరాజ్యమేల" యనెను. ఆమాటలువిని కర్ణుఁడు సమాధానము చెప్పజాలక నిట్టూర్పువిడిచి నిలుచుండెను. అందుపై దుర్యోధనుఁడిట్లనియె "భీమసేన! నీవిటులనవచ్చునా! గొప్పవారల జన్మము నేఱుల జన్మముఁ జెప్పఁగలమా? ద్రోణాచార్యుని జన్మమెట్టిది? మా యన్నదమ్ముల జన్మమెట్టిది?" అనిభీముని మందలించి కర్ణుని తోడ్కొనిపోయెను. మఱునాఁడు ద్రోణుఁడు శిష్యులనందఱఁ బిలిచి "కుమారులారా! మీకు విద్యాసమాప్తియైనది. నాకు గురుదక్షిణ యీయవలయును. పూర్వమొకానొకసమయమునఁ బాంచాలదేశపాలుఁడగు ద్రుపదుఁడు నన్నవమానించి పంపివేసెను. వానిఁబట్టి తేవలయును. ఇదే నాకు దక్షిణ" యని చెప్పెను కాని శిష్యులందఱు దెల్లపోయినిలుచుండిరి. అప్పు డర్జునుఁడు "నేను ద్రుపదుని బంధించి తెచ్చెద" నని చెప్పెను. తరువాతఁ గౌరవబలముతోఁ బాంచాలముపై దాడి

వెడలి యర్జునుఁడు ద్రుపదుని బంధించి ద్రోణునకొప్పగించెను. ద్రోణుఁడు ద్రుపదుఁజూచి "రాజా! యిప్పుడైన మేము మీ స్మరణకు వచ్చితిమా? గర్వముపనికిరా" దని బుద్ధిచెప్పి వదలి పెట్టెను. ద్రుపదుఁడు తనదేశమునకుఁబోయి ద్రోణుని జంపఁ గలిగిన కుమారునొకని యర్జునుని వివాహమాడఁగల కుమారి నొక్కతెను గోరి యజ్ఞము చేసెను. ఆహోమకుండము నందు నీలశ్యామ యగునొక సుందరియు సహజకవచకుండలు డగు నొక కుమారుఁడును బుట్టిరి. ఆ బాలికకుఁ గృష్ణయనియు బాలునకు ధృష్టద్యుమ్నుఁడనియుఁ బేర్లు వెట్టిరి.

ఇచ్చట హస్తినాపురమున భీష్ముఁడు విదురుఁడును ధృతరాష్ట్రునితో "రాజా! యుధిష్ఠిరుఁడు నీకుమారులందఱి లోఁ బెద్దవాఁడు; సుగుణవంతుఁడు. కావున నాతనియువరాజుఁ జేయుమనిరి" వారమాదేశమున నాతఁడు యుధిష్ఠిరునకు బట్టాభిషేకము చేసెను దీనితో దుర్యోధనుని మనోవిచారము దుర్భరమయ్యెను. తనదుఃఖముఁ బట్టజాలక వాఁడు తండ్రి యొద్దకుఁబోయి "నాయనా! నీవు వెనుక ముందు లాలోచింపవు. పూర్వముపాండురాజు రాజ్యము చేసెను. ఇప్పుడు ధర్మజునకు యౌవరాజ్యాభిషేకము చేసినాఁడవు. దీనివలన పాండవులనేఁ బ్రజలకు ననురాగముగలుగును. వారలకుఁ బాండవులె రాజ్యముచేయవలయునని యుండును. మేమును మాసంతతివారును ముందుముందు రాజ్యహీనులమగుదుము. ముసలివారిమాటలు విని మోసపోతి" వనిచెను. ధృతరాష్ట్రుఁడుచెప్పె

గొడుకుమాటలు విని ‘‘తండ్రీ! నీవు చెప్పిన సంగతులె నేను నాలోచించుచున్నాను. పాండురాజునాయందుఁజాలభక్తిగలవాఁడు. వాని కుమారునకు యౌవరాజ్యాభిషేకము చేసెదమనిన వలనుగాదన లేక పోతిని. ఇప్పుడేమి చేయవలయు’’ ననెను. దుర్యోధనుఁడును తండ్రి త్రోవకు వచ్చుచున్నాఁడని తెలిసికొని ‘‘ఏమియు లేదు. కుంతిని గుమారులను గొంతకాలము వారణావతమునకుఁ బంపుము. వారచ్చట బ్రాహ్మణసంతర్పణలతో నుత్సవములతోఁ గాలక్షేపముచేసి కొంతకాలముండి రమ్మనుమని చెప్పెను ధృతరాష్ట్రుఁడు నటులెచేసెదనని చెప్పి వానిని బంపెను.

పిమ్మట నాయంధభూపతి కుంతిం బాండవులనుఁ బిలిచి వారిని వారణావతమునఁ గొంతకాలమ్ముండి రమ్మని చెప్పెను దుర్యోధనుఁ డింతలో వారణావతిసౌందర్యమును నచ్చటనున్న విశ్వేశ్వరు మాహాత్మ్యమునుఁ గుంతికిఁ గుమారులకు వర్ణించి చెప్పుటకై కొందఱ నియమించెను. వారివర్ణనల విని కుంతియుఁ గుమారు లదివఱకె వారణావత సందర్శనాభిలాషనుండిరి.

ఫాల్గుణశుద్ధాష్టమినాఁటికిఁ బాండవులు వారణావతమునకు వచ్చెదరని యచటఁ బ్రకటించిరి. వారికొఱ కొకదివ్యభవనముఁ గట్టవలయునని పురోచనుఁడను నొకశిల్పకారుని నియమించిరి. వాఁడు వారణావతమునకుఁ బోవనున్న సమయమున దుర్యోధనుఁడు వానిని బిలిపించి ‘‘పురోచనా !

నాకు నీకంటె విశ్వసనీయుఁ డింకొక్కఁడు లేఁడు. నీకు నే నపారధన మిచ్చెదను. నీవు గట్టునిల్లు లక్కయు, నూనెయు గలిపి పూతఁబెట్టినదారువున గట్టుము. సమయముఁ గని పెట్టి పాండవు లాయింటిలోఁ జచ్చునట్లుల జేసితివేని నీకు లాభము గలుగఁగలదని చెప్పి పంపెను. పురోచనుఁడును దుర్యోధనునిమాటమననమునందుంచుకొని వారణావతమునకుఁబోయి చక్కని నిగనిగలాడు చేవపలకలతో నతిసుందరముగ మందిరము నిర్మించెను. బల్లలన్నియు లక్క పూతఁ బెట్టెను.

పాండవుల ప్రయాణసన్నాహావసరము లందు దుర్యోధనుఁ డతికుతూహలముగఁ బనిచేసెను. విదురుఁ డది చూచి యోహో! ఇది యంతయు నీచతంత్రమువలె నున్నదనుకొనెను. ప్రయాణదినము వచ్చెను. పాండవులు సిద్ధముగ నుండిరి. బంధువు లందఱిదగ్గఱ సెలవుతీసికొని రథము లెక్కిరి. పురజనులందఱు వారినిర్గమమునకు విచారించుచుఁ గొంతదూరము సాగనంపి మరలివచ్చిరి. విదురుఁడు ధర్మజునితోఁ "గొంతదవ్వరిగి నేను పోయివచ్చెద. ధృతరాష్ట్రుఁ డీవిధమునఁ బ్రియము గనిపింప నమ్మింపుచున్నను ముందు ముందు మీకపకారము చేయును. విషాగ్నుల విషయమున నేమఱక యుండు"డని చెప్పి పోయెను.

పాండవులు వారణావతమునకుఁ బోయి యొకసుముహూర్తమున నూతనగృహప్రవేశము చేసిరి. యుధిష్ఠిరుఁ డిల్లంతయుఁ బరీక్షించి చూచి తన తమ్మునితో "భీమసేనా

ఇల్లంతయు లక్కతోడను గజ్జితోడను గట్టియున్నది. నూనె
వాసన వేయుచున్నది. విదురునిమాటలుగూడ నీయర్థ
మునే సూచించుచున్నవి. ఇది మనలను మోసముచేయుటకుఁ
గట్టించినటులున్నది" యని చెప్పెను. భీముఁ డది విని యటు
లైనఁ దత్క్షణమే పురోచనుఁ జంపి యిల్లుగాల్చి హస్తినాపుర
మునకు వెళ్ళెదమనెను. యుధిష్ఠిరుఁడు చాలఁ దెలివిగలవాఁడు.
మనము తొందరపడరాదు. ఇది తెలిసిన భీష్మవిదురులకుఁ
గోపము వచ్చును. కులప్రళయముఁ గలుగును. మనమె
జాగరూకులమై యుండుట మంచిదని చెప్పెను. లాక్షాగృహ
మునకుఁ జెంత నాయుధాగారముఁ గలదు. పురోచనుఁడు
తనపరివారముతో నందు నివసించి యుండెను.

ఇచ్చట హస్తినాపురమున విదురుఁడు పాండవులనే
తనమనస్సునఁ బెట్టుకొని దుర్యోధనువర్తనమంతయు మెల
కువగాఁ దెలిసికొనుచుఁ గనిపెట్టుచుండెను. పురోచనునకు
దుర్యోధనునకు నుత్తరప్రత్యుత్తరములు నడచుచుండెను.
శ్రావణబహుళచతుర్దశినాఁడు పాండవులు నిద్రించుసమయ
ముఁ జూచి లక్కయిల్లు తగులబెట్టవలయునని దుర్యోధనుఁడు
వానికిఁ దెలియఁబఱచెను. విదురుఁడు నిది చారులవలన గ్ర
హించి యొకఖనకునిఁ బాండవులదగ్గఱకుఁ బంపెను. పాండవు
లిది యెఱుఁగక పగలు నిత్యసంతర్పణములు రాత్రుల నుత్స
వములు చేయుచుఁ గాలక్షేపము చేయుచుండిరి.

విదురుఁడుపంపిన ఖనకుఁడువచ్చి యుధిష్ఠిరునకుఁ దాను వచ్చినకారణము చెప్పి యాతనిసేవకునివలె నింటనుండెను. పగలంతయు నింటిపనులుచేయుచు రాత్రియింటిమధ్యభాగము నుండి యాసమీపమునను న్న యడవిలోనికి వచ్చులాగున నొకసురంగము త్రవ్వుచుండెను. కృష్ణచతుర్దశినాటికి సురంగముఁ బూర్తియయ్యెను.

నాఁడు వారుకొప్పునను సాయంకాలమునందు బ్రాహ్మణులు భోజనములుచేయుచుండిరి. రాత్రి పొద్దుపోవువఱకు హరికథాకాలక్షేపమయ్యెను. అప్పుడు పురోచనుఁ డాయుధాగారమున నేమియు నెఱుఁగనట్లు నిద్రించెను లక్కయింటివాకిట దాసియు దానికుమారు లైదుగురుఁ బండిరి. అందఱును బాగుగ నిద్దురపట్టినతరువాత భీముఁడు పురోచనుని లోననుంచి యాయుధాగారము మూసి దానినంటించెను. పిమ్మట వేగముగావచ్చి తల్లిని సోదరులను సురంగములోనికిఁ బంపి లక్కయిల్లంటించి ఖనకునకుఁ దనక్షేమముఁ దెల్పి తానునుఁ జనెను. పాపము! పురోచనుఁ డెప్పుడో యేదో చేయుదమనుకొనెను. సురంగామార్గముఁ బాండవు లాసమీపారణ్యముఁ జేరి గంగానదిదాఁటి దక్షిణముగఁ బోయిరి. పురోచనుఁడు చచ్చెను లక్కయింట నిద్రించుచున్న దాసియు దానిపుత్రు లైదుగురును గాలిరి.

మఱునాఁడు పురవాసులు లేచి చూచునంత లక్కయిల్లు కాలియుండెను. అందఱిబూదిపరికింపఁ గాలినశవములా

కనఁబడెను. అదిచూచి కుంతియుఁ గుమారులు నందుఁ జచ్చిరని వారనుకొనిరి. ఇదంతయు ధృతరాష్ట్రుఁ డొనరించెనని తలచిరి. అతనిని శపించిరి, పాండవుల గుణములు స్తుతించిరి, అయినను నిజమెంత కాలము దాఁగును? క్రమక్రమముగా నీపని దుర్యోధనుఁడు చేయించెనని తెలియవచ్చెను. ఏమ్మటఁ బురవాసులు కొందఱు పాండవులను గుంతియుఁ జనిపోయిరని ధృతరాష్ట్రునకుఁ దెలియఁజేసిరి. ఆవృద్ధరాజది విని మిగుల విలపించెను.

"ఉ. బాధితశత్రువర్గులగు పాండుకుమారుల దుఃఖవార్త యు
ర్వ్యాధము లైన సౌబల దినాధిపసూనులయొద్దఁ దుష్ట దు
ర్యోధనులాదిగాఁగ సుతులున్నసభన్ విని దుఃఖితాత్ముఁడై
యాధృతరాష్ట్రుఁ డావఁజనిసల్పఁ జేసె వివిధప్రలాపుఁడై."

గాంధారి మొదలుగాఁగల దేవీజనుల యాక్రందనధ్వనుల సంతఃపురమంతయు సంక్షోభించెను. భీష్మాదిహితబంధువులు మిక్కిలి దుఃఖించిరి. విదురుఁడును దెలియనివానివలె నందఱుఁగలసి కన్నీళ్లు విడిచెను. దుర్యోధనుఁడును వానిస్నేహితులును దమపూనిక కొనసాగినదని మనోవికాసము చెందిరి.

# నాల్గవ ప్రకరణము.

---

### బక హిడింబులు.

గంగానదిదాఁటి పాండవులు దక్షిణముగఁ బోయిరి. పోవుకొలఁది నరణ్యము దట్టమయ్యెను. తరుశాఖలొండొంటి తోనల్లుకొని పగలుసూర్యుఁడును, రాత్రినక్షత్రములును గనిపింపకుండెను. క్రిందముండ్లపొద లొత్తుగనుండెను. కొంతదూర మేఁగునప్పటికందఱుసలసిపోయిరి. భీముఁడప్పుడు వారినందఱ దనభుజములమీఁద నెక్కించికొని నడవసాగెను. ఆరాత్రియంతయు, నడచినడచి మఱునాఁటిసాయంకాలమునకు వాఁడొక పెద్దమఱ్ఱిచెట్టుదగ్గఱకువచ్చెను. అచ్చటఁ దల్లినిఁ దోబుట్టువులను దింపి కొంచెము సేపునిలిచెను. మధ్యాహ్నమునుండియుఁ గుంతి దాహమనుచుండెను. ఆసమీపమునందెందైన నుదకము దొరకునేమోయని యాతఁడామఱ్ఱిచెట్టెక్కిచూచెను. అటులఁ జూడగ నచ్చటకుఁ గొంచెముదూరమునఁ గొంగలు మొదలగు జలపక్షులు గనిపించినందున నందొక చెఱువుగలదని నిశ్చయించి నీళ్ళు తెచ్చుట కచ్చటకుఁబోయెను. ఆతఁడు వెడలిన కొంచెము సేపటికి మార్గాయాసమున నలసియున్నందున నందఱు నచ్చటియాకులపై నొఱగి గాఢముగ నిద్రించిరి. భీముఁడును జెఱువునకుఁబోయి తామరాకులు దొన్నెలుకట్టి వానితో నీళ్ళు తెచ్చెను.

భీముఁడువచ్చి వారు నిద్రలేచువఱకు నిరీక్షించుచుండెను. ఆవనమున హిడింబుఁడను నొకమానవాశనుఁడు కలఁడు. వాఁడుసమీపమున మనుష్యులున్నట్లు పసిపట్టి తిన్నఁగఁబోయి చూచిరమ్మని హిడింబియను తన చెలియలిఁబంపెను. అదియు వచ్చి వీరినందఱఁగాపాడుచున్న భీమునిఁజూచెను. అది యిదివఱకెంత తీరైనవానినెన్నఁడుఁ జూచియెఱుఁగదు. వానిఁగనినంతనె యామెకాతనియం దనురాగముగలిగెను. అది తన రాక్షసరూపమువదలి, కామరూపకావున నందమగు మానవభామినియై భీమునిసమీపించి తనహృదయ మతనికిఁ దేటపడనిట్లనెను. "అయ్యా! యిది హిడింబునివనము. ఇచ్చటకెవ్వరు రాను. వచ్చినవారినందఱ నాతఁడు మ్రింగుచుండును. వీరు వచ్చిరని కనిపెట్టిచూచిరమ్మని నన్నుఁబంపినాఁడు. మిమ్ముఁ జూడ నాకనురాగము కలిగినది. నన్ను వివాహమయితిరేని మీకుపకారము చేసెదను. భీముఁడు నవ్వి "చాలు నీమాటలు! నీయన్నకుజడిసి ప్రాణములుదక్కవని నిన్నుఁ బెండ్లాడెదనా.

క. వినుబేల యెట్టికష్టుఁడుఁ
దనపురుషగుణంబు సెడఁగఁదల్లి నిఁ దోఁబు
ట్టినవారి విడిచి రాగం
బునఁజపలస్త్రీసుఖంబు వొందునెచెపుమా?"

అని దానివిన్నపముఁ ద్రోసివైచెను అయినను అది మోహమున "మాయన్నవచ్చుగావున మిమ్మందఱ నింకొక

చోటకుఁ దీసికొనిపోయెదను. నాయందు దయఁజూపుఁ" డని ప్రతిమాలుకొనెను.

ఆలో హిడింబుఁడును, దన చెల్లెలింతయాలస్యము చేసిన దేమి కారణమోయని వెదకికొనుచువచ్చి యచ్చటభీమునితో సరసములాడుచుండుటఁ జూచి కోపమున "ఓసీ! దుర్మార్గురాల! నన్నును వీరిందినెదవా?" యని గర్జించుచు భీమునిపైఁబడెను. భీముఁడును వానితో మల్లయుద్ధమునకుఁ దలపడెను. తామిద్దఱుఁ బోరాడునప్పు డగుచప్పుడులచేఁ దనవారికి నిద్రచెడునను భయమున భీముఁడా రాక్షసుని దూరముగ నీడ్చుకొనిపోయెను. తెల్లవాఱుజామునఁ గుంతియు దక్కినవారును లేచిరి. ఓహో! వారియాశ్చర్యమేమనవచ్చును. వారిముందఱ నప్సరసలాగున నున్న హిడింబి కనఁబడెను. ఆమెయుఁ గుంతికి నమస్కరింప దనకును భీమునకు నడచినవృత్తాంతమంతయుఁ జెప్పి కొంచెము దూరమునఁ బోరాడుచున్న భీమునిఁ దనయన్ననుఁ జూపెను. కుంతియు దానికభయమిచ్చి యూఱడించెను.

హిడింబునితోఁ బోరుచున్న తనయన్నను గాంచి యర్జునుఁడు హెచ్చరించుచు, "వీనినింకేమి బాధపెట్టెదవు? చంపు" మనెను. భీముఁడును బలమంతయుఁ బూన్చి యా రాక్షసుని వీపువిఱిచిచంపెను

అరుణోదయమయ్యెను. వారచ్చటనుండి యింకొక స్థలమునకుఁ బోవఁదలఁచిరి. వారితో హిడింబియును బయలుదేరెను. పాపమా హిడింబి "నేను మీతో వచ్చెదను భీముఁడె

నాకుగతి" యని కుంతీదేవినిఁ గరుణామయుగఁ జూచెను, కుంతియు దానిసరళభావమునకు సంతోషించి "భీమసేనా! దీనియందు రాక్షసబుద్ధిలేదు. ఒకకుమారుఁడు కలుగు దనుక దీనితో గాపురము చేయుమని భీమునాజ్ఞాపించెను. భీముఁ డప్పుడాయువతిని గాంధర్వమున వివాహమయ్యెను.

భీముఁడును హిడింబియుఁ బవలెల్ల వనమున విహరించుచు రాత్రి దమవారినిఁ గాచుచు సుఖముగఁ గాలముఁ గడపుచుండిరి. అంతఁ గొంతకాలమునకు వారికొక కుమారుఁడు జనించెను. వానికిఘటోత్కచుఁడని పేరుపెట్టిరి కుమారోదయమైనతరువాతఁ దల్లియాజ్ఞప్రకారము భీముఁడా హిడింబిని దాని నెలవునకుఁబంపెను. ఆమెయు భీమునివదల నిష్టములేక యొటులో వదలి యవసరమైనపుడు తలఁచిన వచ్చెదనని చెప్పి తన నెలవునకుఁ బోయెను.

పాండవు లావనముననున్నప్పుడు శాలిహోత్రుఁడను నొకమునిని సందర్శించి యాతనివలన ననేకధర్మముల నుపదేశములు పొందిరి పిమ్మట నచ్చటనుండి కదలి యింకను దక్షిణముగఁబోయి మత్స్యత్రిగర్తకీచకదేశములుదాఁటి యేకచక్రపురమను నగ్రహారము జేరిరి. అచ్చట వారు బ్రాహ్మణ వేషములుదాల్చి వేదాధ్యయనముచేయుచు, బిచ్చమెత్తుచు నొక బ్రాహ్మణునియింటఁ గాలముఁ గడపుచుండిరి.

అంతఁ గొంతకాలమున కొకనాఁడు వారు కాఁపురమున్న బ్రాహ్మణునింట నందఱు నొక్కపెట్టున నేడ్వసాగిన

'ఇది యేమివిపరీతమో' యని కుంతి లోనికిఁ జని, శోకువచ్చిన యాపద యేమని యాబ్రాహ్మణు నడిగెను. అతఁ "ఈ యగ్రహారమున కామడదూరమున గుహయందు నొక రాక్షసుఁడు గలఁడు. వాఁడీపట్టణముఁ గాపాడుచుండును. వానికై మేము వానికింటివరుసగఁ బ్రతిదినము నొక మనుష్యుని రెండుదున్నలఁగట్టిన బండెడన్నమునుఁ బంపుకొనవలయును. నేఁడు మావంతువచ్చిన" దని చెప్పెను. కుంతియు బ్రాహ్మణుఁడు తనకిదివఱకుఁ జేసిన మేలునకు మాఱుమేలు చేయుటకు సమయము వచ్చినదని తనలో సంతోషించి, "అయ్యా, నాకైదుగురు కుమారులుగలరు. వారిలో నొక్కనిఁ బంపెద" నని చెప్పెను. ఆమాటలువిని బ్రాహ్మణుఁ డదరిపడి "తల్లీ! యేమిమాట!. నాయింటికివచ్చి తలదాఁచుకొన్న మిమ్ము రక్షించుటకు బదులుగ నాకొఱకు మిమ్ముఁ జావనిచ్చుటా!" యనెను. కుంతియంతట విడువక భీముని జూపి, "అయ్యా! వీఁడిదివఱకెందఱనో రాక్షసులఁ జంపినాఁడు. బకునిఁ గూడఁ జంపును. అదియెఱిగియే వీనినిఁ బంపెదననుచున్నా" నని యొప్పించెను. భీముఁడును తనకుఁ జేతులతీఁట పోవునటులఁ బోరుదొరకెనని సంతోషించి బ్రాహ్మణునిఁ గాంచి "మీరు నాకు ముందుగాఁ గడుపునిండ భోజనము పెట్టవలయును. తరువాత రాక్షసునిఁ జంపెద" నని చెప్పెను. ఆబ్రాహ్మణుఁడును సంతోషించి భీమునకుఁ బిండివంటలతో సంతుష్టిగ భోజనముఁ బెట్టించెను.

సాయంకాలమగునప్పటికి బకాసురునకుఁ బంపవల యునన్నశకటము సిద్ధముఁ జేసిరి. పోతులబండినిండ నన్నము నైచిరి భీముఁడు బండితోలుకొని బకాసురుని గుహావద్దకుఁ బోయి వానిఁ బేరుపెట్టి పిలిచి వాఁడు వచ్చులోపున బండిలోని యన్నముఁ దినుచుఁ గూర్చుండెను. రాక్షసుఁడును వచ్చి బండి మీఁద నన్నముఁ దినుచున్న భీమునిఁ జూచి కోపించి ప్రక్క నున్న యొకచెట్టుఁ బెఱికి భీమునిఁ గొట్టఁబోయెను భీముఁడును భయములేక, సమీపముననున్న సాలవృక్షముఁ బెల్లగించి పట్టి బకాసురు నెదిరించెను. ఈవిధముగఁ జెట్లతోఁ బోరాడ నప్పటికి చెట్లన్నియు నాశనమయ్యెను. తుదకు వారొకరి నొకరు తలపడి ముష్టియుద్ధమునకుఁ జొచ్చిరి. నేలయంతయు నదిరెను. తుదకు రాక్షసునిబలము చెడెను. అదిగ్రహించి భీముఁడు వానివీపునుఁ బిడికిటఁ బొడిచెను. ఆపోటున రాక్ష సుని వీపు విఱిగెను. నవరంధ్రములనుండియు రుధిరధారలు వెడలెను. దానితో గట్టిగ నఱచుచు నేలఁ గూలి వాఁడు చచ్చెను. వానియఱపు విని యందందు గిరికందరములనున్న వాని బంధువులు వచ్చి భీమునిఁ దాఁకిరి కాని వానిముందట ని లువలేక పాఱిపోయిరి. భీముఁడును వారినేకచక్రపురముపైఁ కెప్పుడు రావలదని శాసించి బకాసురుని కళేబరము నీడ్చి తెచ్చి యందఱుఁ జూచునటులఁ బురద్వారమునఁ బడవైచెను. అది చూచి పురవాసులందఱు భీముని పరాక్రమముఁ బొగడి వానికి సాష్టాంగనమస్కృతిగావించి తమయిండ్లకుఁ బోయిరి.

బకాసురసంహారానంతరమునఁ బాండవు లేకచక్రపురమున సుఖముగఁ గొంతకాలముండిరి. తొల్లి పాంచాలభూవల్లభుఁ డగ్నిముఖమున నొకకుమారిని గాంచెనని వినియున్నాముకదా! ఆకుమారి కిప్పుడు పెండ్లియీడు వచ్చినందున ద్రుపదుఁడు స్వయంవరముఁ జాటించెను. పాపమతఁడా కన్య నర్జునున కీయఁదలచెను. కాని పాండవులు లాక్షాగృహమున మృతిఁబొందిరని వినినందున నెంతయు శోకించెను. ఆతని విచారముఁజూచి యాతనిపురోహితుఁడు "రాజా! శోకింపకుము. నీకుమారి నర్జునునిమిత్తమే దేవతలు సృజించిరి కావున నిజముగాఁ బాండవులు గతింపలేదు. ధనుర్విద్యయం దర్జునునకు సరివచ్చువారు లేరని విందుము. కావున నపూర్వలక్ష్యమొకటి నిర్మించి స్వయంవరాగత భూపతుల దానిం గొట్టనియమింపుము" అని చెప్పెను. ద్రుపదుఁడు నాతని మాటలు విని యూరడిల్లెను.

అర్జునున కిస్వయంవరమునకుఁ బోవలయునని కుతూహలముగలిగెను. కుంతి యది గ్రహించి యొకనాఁడు తనతనయులఁ బిలిచి "నాయనలారా! మనమిచ్చటఁ జిరకాలము నిలిచినారము. ఇందువలన మనకు లాభమేమి? అదియుఁ గాక మగవానికిఁ బరులపంచఁ జిరకాలము వసింపరాదు. పాంచాలదేశము సుభిక్షమనియు నచ్చటిరాజు న్యాయపరుఁడనియుఁ జెప్పుదురు. మనమచ్చటికిఁ బోవుదము" మనెను. తల్లిమాటలు విని కుమారులును జాల సంతోషించిరి.

**మఱునాఁడు** వారందఱు బయలుదేరి పాంచాలాభిముఖముగఁ జనిరి. **మార్గమునందు** మఱికొందఱు బ్రాహ్మణులు వీరిని గలిసికొనిరి. వారితో వీరును సహవాసముగఁ గొంతవఱకు నరిగినతరువాతఁ బాండవులు వారిని “మీరెచ్చటికేగెదరని” యడుగ వారు “రేపు పుష్యబహుళపంచమినాఁడు పాంచాలరాజు కూఁతునకు స్వయంవరము. కావున మేము కాంపిల్యమునకుఁ బోవుచున్నాము. స్వయంవరమునకు వచ్చినరాజులు బ్రాహ్మణులకు మంచిబహుమానము లిచ్చెదర”ని చెప్పిరి. పాండవులును వారితో “మేమునచ్చటికె వచ్చుచున్నా” మనిరి అటుల వారు బ్రాహ్మణులతోఁ గలసి కొన్నిదినములు నడచి తుదకుఁ గాంపిల్యనగరముఁ జేరిరి అంతకుఁ బూర్వమె స్వయంవరమునకు వచ్చిన రాజబృందములతోడను, వారి పరివారములతోడను, వారి కరితురంగనికరబృంహితహేషితములతోడను,ఁ బురమంతయు మహాసంరంభమునఁ బొదలి యుండెను.

పాండవులును నెమ్మదిగ నగరములోనికిఁ జని, యొక కుమ్మరివానియింటఁ బేదబాపలటుల, నివురుగప్పిన నిప్పుల వలెఁ బ్రచ్ఛన్నులై యుండిరి.



# అయిదవ ప్రకరణము.

## ద్రౌపదీస్వయంవరము.

పుష్యబహుళపంచమి వచ్చెను. కాంపిల్యపురవాసులందఱు ద్రౌపదీ వివాహమహోత్సవాలోకన కుతూహలాయత్తులై యుండిరి. నగరమతిరమణీయముగ నలంకరింపఁబడెను. మంగళవాద్యములు మిన్నుముట్టెను.

ద్రుపదుఁడును ఘనసన్నాహము చేసెను. అధికారులు పట్టణమున కీశాన్యభాగమున విశాలమహాశాలయొకటి నిర్మించిరి. దానికిసమున్నతమగు ప్రాకారముఁగట్టిరి. చుట్టును నిర్మలజల పూరితమగు కందకమొకటి యమర్చిరి. లోపలమందిరమంతయుఁ బూవులతోఁ దోరణములతో నలంకరించిరి. నేలయందంతటఁ బన్నీరుచల్లి గంధముతో నలికిరి. వరుసవరుస నృపకుమారులు కూర్చుండుటకు మంచికలరచించిరి. ఈమంచికలకుఁబోవు మార్గములయందు విచిత్రవర్ణ భాసురములైన జముకాణములఁ బరచిరి. శ్వేతవితానములు, సౌవర్ణగోళములు, స్తంభస్తంభాంతర్గత ముక్తాహారములు నతిరమణీయములై యుండెను.

స్వయంవరసమయమునకుఁ బూర్వమె నృపకుమారులందఱు వచ్చి మంచికలపై వసించిరి. దుర్యోధనాది ధార్తరాష్ట్రులు, శ్రీకృష్ణ బలరాము ప్రభృతియాదవులును వచ్చిరి.

ప్రేక్షకసంఘముల సమ్మర్ద మెక్కువయ్యెను. పాండవులును
వచ్చి బ్రాహ్మణులతోఁ జేరి కూర్చుండిరి. ద్రుపదుఁడు సభా
మండపము జొచ్చి బ్రాహ్మణులకు నమస్కరించి నిలిచెను.
ఆతని పురోహితుఁడగ్నిని బ్రజ్వలింపఁజేసి వేల్చి, స్వయంవ
రార్థసంపాదిత ధనురాదిసాధనముల ధూపదీపనైవేద్యములఁ
బూజించి మీఁది కార్యమునకు సిద్ధముగనుండెను. ముహూర్త
ము సమీపించెను. రాజలోకమంతయు ద్రౌపది యెప్పుడు
వచ్చునాయని యూర్పులై విమనస్క సమాహితచిత్తులై నిరీ
క్షించుచుండిరి. అంత ద్రౌపది తెల్లని చీరఁగట్టి తెల్లని పూ
వులఁ జుట్టి, స్వయంవరసమయసంలబ్ధవరకంఠాభరణాయ
మాన మగు శ్వేతపుష్పదామము కరద్వయమునఁ
గీలించి ధృష్టద్యుమ్నునితో సభామధ్యమునకు వచ్చెను. అంద
ఱు నొక్కమాఱు లతాతన్వి సుకుమారాకారముఁ గాంచి
కృతార్థులైరి.

సభయందు సందడి యడఁగిన వెనుక ధృష్టద్యుమ్నుఁడీ
తెఱఁగున నుపన్యసించెను. "రాజోత్తములార! ఇదిగో నాచె
ల్లెలు, కృష్ణ! దీనికొఱకే స్వయంవరముఁ జాటితిమి. ఈసభామ
ధ్యముననున్న స్తంభాగ్రమున మత్స్యాకృతి యొకటి సునిశిత
సూత్రమున వ్రేలుచున్నది. దానిని క్రిందనున్న యుదకమునఁ
జూచి యీయగ్నిసన్నిధినున్న వింటితో నేవీరుఁడు కొట్టునో
యతఁడె దీనికిఁదగినవరుఁడు. దీనికి సమ్మతించినవారు శరాస
నముఁ గైకొని యంత్రము నేయఁ బ్రయత్నింపవచ్చు"

ధృష్టద్యుమ్ను పలుకులాలించి నృపకుమారు లొకరి వెనుక నొకరు వచ్చి విల్లు చేసిరి. కొందఱది వంపనే లేకపోయిరి. కొందఱువంచినను నారి నెక్కిడ లేకపోయిరి. కర్ణుఁడు సైతము విల్లెక్కిడఁజాలక మరలెను. ఏమి? దేశమున నిండఱు రాజు లున్నను ద్రౌపదికిఁ దగినవరుఁడై వారిలోఁ గుదురకపోయెను.

ఆసమయమున బ్రాహ్మణులలోనున్న యర్జునుఁడు ధర్మజుననుమతిఁ జేకొని నిలిచి విల్లుతెమ్మనెను. రాజులందఱు నవ్విరి. కాని ద్రుపదుఁడు "బ్రాహ్మణుఁడు క్షత్రియకాంత ల వివాహముగావచ్చుఁ గావున నాతఁడు బ్రయత్నింపవచ్చు" ననెను. అప్పుడర్జునుఁడు లేచి యగ్నికిఁ బ్రదక్షిణముఁ జేసి పెద్ద లకు నమస్కరించి తన ప్రాఁతవింటిని వంచినట్లువలీలనావిల్లును వంచి గుణమెక్కించి, యతిసూక్ష్మముగ మత్స్యయంత్రముఁ దెగనేసెను. బ్రాహ్మణులందఱు దమకులమితనివలన వన్నె కెక్కనని కేకలువేయుచు, దర్భాసనము లెగురవేయుచుఁ జప్పటులఁజఱచుచు మహోత్సాహముఁ జూపిరి.

అప్పుడు ద్రౌపది తనచేతిలోని పూలదండఁ దెచ్చి యర్జునున కెదురుగనిలిచి యాతనిఁ దనసంపూర్ణదృష్టులఁ జూచుచు దానినతనికంఠమున నుంచెను. ఆవీక్షణముతోనే వా రలహృదయములు శాశ్వతముగఁ గలిసికొనను.

ఈవైభవమంతయు బ్రాహ్మణునకుఁబట్టినదని క్షత్రి యులకు గన్నెఱ్ఱ యయ్యెను. కొందఱు బ్రాహ్మణబాలునిఁ

బట్టుఁడనిరి. కొందఱు బ్రాహ్మణుని చేమితప్పు. ద్రుపదునకు బుద్ధి చెప్పవలయును మనల నందఱరప్పించి యవమానము చేయు నా? యనిరి. అంత ద్రుపదుఁడు భయపడి బ్రాహ్మణసంఘమున దాఁగెను. అర్జునుఁడు రాజునకభయమిచ్చెను. భీముఁడు వచ్చి తమ్మునిప్రక్కనిలచెను. బ్రాహ్మణులందఱుఁ దలపాగ లఁగొని చెంబులుకట్టి గిరగిరఁద్రిప్పుచు రాజులపైఁబడిరి. అర్జునుఁడు వారినందఱవారించి తనశరపరంపరలచే ధరావరుల, ధారాధరములు జలధారలచే శరజాతములఁ వాల్చునటులఁ జిందఱవందఱఁ చేయుచుండెను. కర్ణుఁ డర్జును నెదిరించెను. శల్యుఁడు భీమునిఁదాఁకెను. కొంతసేపునకుఁబోరునప్పటికిఁ గర్ణునకుఁ దలమున్కలై ,,యయ్యా! నీవుబ్రాహ్మణుఁడవు. బ్రహ్మ తేజము నోర్వఁజాలుదునే! '' యని విరమించెను. శల్యుఁడును భీమునిముందఱ ద్వంద్వయుద్ధమున నిలువలేక క్రిందపడిలేచి దుమ్ముదులిపికొనుచుఁ జల్లజల్లగ దాఁటెను. తక్కినరాజులం దఱుఁ దమతమదేశములకుఁ బోయిరి.

అప్పటఁ గుంభకారునింటఁ గుంతి తనకుమారు లింత ప్రొద్దెక్కియు నేలరాలేదని చింతించుచుండెను. అంతలో నర్జునుఁడు వీధిలోనుండి నవ్వుమొగముతో ,,నమ్మా! మాకీ నాఁడు మంచిభిక్షదొరికిన''దని యఱచెను. కుంతియునదినిజ మని తలఁచి ,,నాయనా! మీరందఱు దానినిసమానముగఁ బంచికొను'' డనెను. అంతలోనర్జునుఁడు ద్రౌపదిని దల్లిముంగ దఱకుఁదెచ్చి నిలిపెను. కుంతి తెల్లఁబోయెను. తనయాజ్ఞావచన

మసందర్భమని తెలిసి నిశ్చేష్టయయ్యెను. ద్రౌపది నైదుగురు కుమారులుఁ బెండ్లియాడవలయునను టెంతవిరుద్ధము. అంతనర్జునుఁడు "తల్లీ నీవు చెప్పినటుల మేమైదుగురము దీనిని వివాహమయ్యెద"మనెను. ధర్మరాజు "అర్జునా! నీవు స్వశక్తివలన దీనినిఁ దెచ్చితివి నీవె పరిణయమగుట న్యాయ"మనెను. కాని యర్జునుఁడు మాత్రము తల్లిమాట నిల్పెదనని పట్టుపట్టెను.

కుంతీదేవి తనకోడలికి భిక్షాపాత్రనిచ్చి యందలియన్నములో సగము భీమునకుఁ బెట్టుమని చెప్పి తక్కినది మిగిలిన యానలుగురకుఁ బంచిపెట్టించెను. భోజనానంతరము ద్రౌపది దర్భలువిదిర్చి శయ్యలుపఱచి పాండవులందఱు శయనింపఁ దాను వారిపాదములవైపున నడ్డముగఁ బరుండెను. ఆహా యామెహృదయ మెంతయుదారము.

ఆ. కఱకుదర్భ పూరిపఱపులు భిక్షాన్న
మశన మట్టివారినతిముదమున
నాదరించెఁ బ్రీతి నాదిగర్భేశ్వరి
యయ్యు నేవగింపదయ్యెఁ గృష్ణ.

వీరిప్రవర్తనమంతయు రహస్యమున ధృష్టద్యుమ్నుఁడు చూచి తనతండ్రికిఁ జెప్పెను. వీరెవరైనదింకనుఁ దెలియదు కదా.

ద్రుపదుఁ డీసంశయముఁ దీర్చుకొనదలఁచి నిపుణవచోరచనావిశారదుఁడగు తనపురోహితుని వారిదగ్గఱకుఁ బంపెను. అతఁడు ధర్మరాజుఁ దమచరిత్రమడుగ నాతఁ "డయ్యా!

మీరాజు చెప్పినపని చేసితిమి. ఇంక నేమికావలయు. మేమెవర మైననేమి ? అల్పులట్టిపని జేయఁగలరా ?" యనెను. పురోహితుఁడు ద్రుపదున కీమాటలు చెప్పిన నతఁడు చాతుర్వర్ణోపయోగార్హములైన రథములను వారియొద్దకుఁ బంపి వారలఁ గొనిరమ్మని ధృష్టద్యుమ్నునిఁ బంపెను. అప్పుడు పాండవులు క్షత్రియార్హరథములనెక్కి ద్రుపదు నాస్థానమునకుఁ జనిరి, అచ్చట ధర్మరాజు తమయథార్థస్వరూపముఁ జెప్పెను. ద్రుపదుఁడు సంతోషించి యర్జునునకుఁ దనకూఁతునిచ్చి వివాహము జేసెదననెను. కాని ధర్మజుఁడు "రాజా ! మాతృనియోగమున దీనినందఱము పెండ్లిచేసికొనవలయు" ననెను. ద్రుపదుఁడది యాచారముగాదని నిరాకరించెను. వారియదృష్టవశమున నచ్చటి కప్పుడు వ్యాసుఁడువచ్చి యుధిష్ఠిరునిమాటలు ద్రుపదునివాదమువిని యాచారవిరుద్ధమైనను నదిమాతృనియోగము గావున ద్రౌపదినైదుగురకుఁ బరిణయము చేయవలయునని నిశ్చయించెను. అంతనొకసుముహూర్తమున నామెను వరుసగ నైదుగురికినిచ్చి వివాహము చేసిరి.

ఈవివాహము జరిగినతరువాత శ్రీకృష్ణుఁడు తనమేనత్తయు, మఱఁదులు వారణావతమున మృతి బొందలేదని విని వారిని జూడఁ గాంపిల్యమునకు వచ్చెను. ఇటులసమస్తబంధుసమేతుఁడయి ద్రుపదుఁడు మహానందమున నోలలాడుచుండెను. పాండవులును స్వస్థచిత్తులైరి.

---

# ఆదిపర్వప్రకరణము.

ఇంద్రప్రస్థము.

పాండవులు వారణావతమునఁ జావలేదని ధృతరాష్ట్రుని సభయందును దెలిసెను. కురువృద్ధు లానందముఁ బొందిరి. దుర్యోధనునకు మరలవిచారము వచ్చెను. వాఁడొకనాఁడు తండ్రిదగ్గఱకుఁబోయి „నాయనా! వింటివా? ఇది నాదురదృష్టము. పాండవులవలని బాధతీరినదనుకొనుచుంట వారింకను జీవించియున్నట్లు వినుచున్నాను. అంతేకాక పాంచాలునితో సంబంధమువలన వారు మఱింతబలవంతులైరి. ఎట్లైన వారిని బాంచాలునుండి విడదీయుటయె మంచిదనెను. ధృతరాష్ట్రుఁడుదు విని „నేను నదియే యూహించుచున్నాననెను. కర్ణుఁడు పాంచాలముపై దాడిపెడలి పాంచాలునిఁ బాండవులనుఁ జెఱపట్టుట మంచిదని" చెప్పెను.

భీష్మవిదురు లెదుర్మంత్రమంతయుఁ దెలిసికొని ధృతరాష్ట్రునిఁ జేరి యతనితో „నీవలనను నీకుమారులవలనను గౌరవవంశమంతరించును. పదుమూఁడుసంవత్సరములు నీపిల్లలతోఁ బెరిగినవారిని వారణావతమునకుఁబంపి చంపఁదలచితిరి. నేఁడు వారికపాయము జేయఁజూచుచున్నారు. వారితండ్రి పాలించిన రాజ్యము వారికేల యీయరాదు? ఇట్టిపిచ్చిచేష్టలుమాని పాండవులఁ బిలిపించి వారికర్ధరాజ్యమిమ్మని మందలించిరి.

ద్రోణుఁడు సరులె చెప్పెను. తక్కిన పెద్దలు వారి బావతమున వారిని కష్టపెట్టిన పాపము దీనిచేఁ బోవునని చెప్పిరి.

ధృతరాష్ట్రుఁడును విదురునిఁబంపి శ్రీకృష్ణసహితంబుగ పాండవులను హస్తినాపురమునకుఁ బిలిపించెను. వారువచ్చిన తరువాత సంపదముందఱ వారలకర్ధరాజ్యమిచ్చెదనని వాగ్దానము చేసెను. పాండవులు కష్టమంతయు మఱచి ధార్తరాష్ట్రులఁ గలసిమెలసి యుండిరి. ఈవిధముగ నైదుసంవత్సరములు గడచెను. అంతనొకనాఁడు శ్రీకృష్ణభీష్మవిదురవికర్ణచిత్రసేనాదులందఱునున్న సభయందితఁడు ధర్మజునకర్ధరాజ్యాభిషేకము చేసెను. మఱికొన్ని దినములకు ఖాండవప్రస్థమున నింద్రప్రస్థమను పట్టణముఁ గట్టించి దానిఁ బాండవులకు రాజధానియని యేర్పఱచి వారి నచ్చటకుఁ బంపె. యుధిష్ఠిరుఁడు నైభవమున సంగ రాజ్యము చేయుచుండెను.

---

# ఏడవ ప్రకరణము.

---

## అర్జును సఖ్యోదయము.

ధర్మరాజింద్రప్రస్థమునఁ జల్లఁగ రాజ్యము చేయుచుండెను. ఆతని ప్రజలందఱు సుఖముగనుండిరి. ఎచ్చటఁజూచిన నుత్సవములె. ఎచ్చటఁజూచిన సంతర్పణములె. ఎవ్వరుజూచిన ధర్మపరులె. యుధిష్ఠిరుఁడును ధర్మకార్యములయందాసక్తితోఁ బ్రవర్తించుచుండెను.

ఒకనాఁడింద్రప్రస్థమున దస్యుసమూహములు చొరఁబడి యొకబ్రాహ్మణుని పశువులఁ దోలుకొనిపోయిరి. ఆబ్రాహ్మణుఁ డతిశోకమునవచ్చి యుధిష్ఠిరుని మందిరమున మొఱ పెట్టుకొనెను. ఆసమయమున రాజాంతఃపురమున నుండెను. అర్జునుఁడాబ్రాహ్మణుని విలాపముల వినఁజాలక యంతఃపురము నకుఁబోయి తన ధనుర్బాణములఁ దెచ్చుకొని శీఘ్రముగఁ జోరుల వెంబడించి యాపశువుల విడిపించెను. బ్రాహ్మణుఁడునుఁ జాల సంతోషించి తన యింటికేగెను.

బ్రాహ్మణుఁడు వెళ్లినంత నర్జునుఁడన్నగారి దగ్గఱకుఁబోయి తాను చేసిన దంతయుఁజెప్పెను. గోరక్షణమహాపుణ్య మర్జునునకు దొరకినను, వానికొక నియమభంగము సంభవించెను. ద్రౌపది వివాహానంతరము పాండవులు, తమలోఁ దా మొక సమయము చేసికొనిరి. ద్రౌపదితో నొకఁడభ్యంతరమందిరమున నుండగ నింకొకఁడచ్చటకుఁబోయె నేని నట్టివాఁడొక యేఁడు దేశాటనమును బ్రహ్మచర్యముం జేయవలయును. కావున నర్జునుఁడు తీర్థయాత్రకుఁ బోవననుజ్ఞయిమ్మని యన్నగారిని వేఁడుకొనెను. ధర్మజుఁడు తమ్మునియందు దోషము లేదని యెఱుఁగుంగావున, "అర్జునా; నీవు దురుద్దేశముతో రాలేదుకదా! బ్రాహ్మణరక్షణపరుఁడవై వచ్చినందున నీ కేనియమభంగము లేదు. నీవెచ్చటికిం బోవనవసరము లేదనెను. అర్జునుఁడు దానిఁ జెవిఁబెట్టి "ధర్మాత్ములమైన మన మె యవ

కాశము దొరకినదని నియమవ్యతిక్రమణము చేయవచ్చునా? ఏమైననసరె నేను తీర్థయాత్ర చేసెద' నని బయలుదేరెను. అత నికి సాహాయ్యముగఁ గొందఱు బ్రాహ్మణులునుఁ జనిరి.

కొంతకాలమున కాతఁడట్లు చనిచని గంగాద్వారమునకు వచ్చెను. అచ్చట నాశ్రమములందు బ్రాహ్మణులతోఁ గాల క్షేపము చేయుచుండెను. ఒకనాఁడాతఁడు ప్రాతః స్నానము చేసి నదిలోనుండి యీవలకు రాఁబోవుచుండ నందుండి యనన్యసామాన్య లావణ్యాగణ్యయైన నాగకన్య యొకర్తు తన మృణాళబాహుపాశమున నతనిఁ బట్టికొని లోనికిఁ గొనిపోయెను. అటులఁ గొనిపోయి జలాంతరాళమున నిజమందిరాంతర శీతలవాతాయనమున నుంచి యతఁడు తెప్పిఱిలి స్పృహవచ్చినతోడనె లే నవ్వు వెన్నెల నిండార "అర్జునా! నేను నాగకన్యను. నాపేరు లూఁపి. నీదివ్యసుందరవిగ్రహముఁగాంచి మోహమున, నిన్ని చ్చటకుఁ దెచ్చుకొంటి" ననెను. అర్జునుఁ డామెయందాదరము గలుగఁ "కాంతా! నేనిప్పుడు బ్రహ్మచర్యము చేయుచున్నాను. ఇది సమయము గాద" నెను. ఉలూచి యంతటఁ జనక మఱియు మఱియుఁ బ్రార్థించినందున నాతఁడచ్చటఁ గొంతకాల మాఁగెను. వారి కిరావంతుఁడను కుమారుఁడుపుట్టెను. పిమ్మట నులూచినివదలి యర్జునుఁడు తనయాత్రల బయలువెడలెను.

క్షేత్రమునుండి క్షేత్రమునకుఁ బోవుచుఁ, బదమూఁడు మాసముల కతఁడు మణిపురమునకు వచ్చెను. ఆపట్టణముఁ జే

త్రవాహనుఁడను రాజు పాలించుచుండెను. వానికిఁ జిత్రాంగ దయను నొక కుమారికలదు. ఆమె చాలసుందరి. అర్జునునకా మెయం దనురాగము కలిగెను. చిత్రవాహనుఁడది గ్రహించి తనకొమార్తె నాతనికిచ్చి వివాహముచేసెను. కొంతకాలమునకు వారికొక బాలుఁడు జనించెను. చిత్రవాహనునకుఁ బురుష సంతతి లేనందున నాబాలునతఁడు పెంచుకొనఁగోరి యర్జునునను మతిఁబొంది తన మనుమనిఁ గుమారునిఁ దనయింటనే యుంచుకొనెను. అర్జునుఁడు నత్తవారియింటనుండి యచ్చటకుఁ జేరువనున్న పుణ్యభూములఁ జూచుచు సంతోషముగనుండెను.

మణిపుర సమీపమున సౌభద్రతీర్థమను నొక కొలను గలదు. ఎవ్వరు నచ్చటికిఁ బోవరనియుఁ బోయినను స్నానము చేయరనియు, స్నానముచేసిరేని నానీటఁగల మహాగ్రాహములు పట్టుకొనఁజచ్చెదరనియు నతఁడువినెను. యౌవనగర్వమున నెవరు చెప్పినను వినక యాతఁడచ్చటికిఁ బోయి స్నానముచేయ నీటిలోనికి దిగెను. కాలుపెట్టినంతనె యొక పెద్ద మొసలివచ్చి యాతనిఁ బట్టుకొనెను. అర్జునుఁడుఁ దటాలున దాని నీడ్చి గట్టుపైకి విసరి చంపఁబోయెను. అంతలో నెంతయద్భుతము! దాని ముందట నొకదివ్యాంగన కానిపించెను. ఆమె యాతనిని సాదరకటాక్ష వీక్షణములఁజూచి ,,రాజవర్యా ! నేనొక నాగకన్యను. నేనును నాచెల్లెండ్రును బూర్వమిచ్చట దపమొనరించుచున్న యొకమునీశ్వరుని జూచి యాతని తపము జెఱుపఁదలఁచి యాతనిచెంత ననేకవిలాసములు చూపితిమి.

ఆతఁడెంతకుం జెదరనందునఁ దుదకు మేమతనిపైఁబడితిమి. ఆ మునికంతఁ గోపమువచ్చి మమ్ము మొసళ్లమై యుండ శపించెను. నా చెల్లెండ్రును నల్లురు యాచేతువులఁ గలరు. వారిని గూడ విడిపింపుమని ప్రార్థించెను. అర్జునుఁడును వారి నందఱఁ జేతువు లనుండి లాగి శాపమును దీర్చెను. అంత నాదివ్యాంగన లాతని నభినందించి నాగలోకమునకుఁ బోయిరి.

సౌభద్రతీర్థమునుండి యర్జునుఁ డపరవారాశితీరమున నున్న ప్రభాసతీర్థమునకుఁ బోయెను. శ్రీకృష్ణనివాసస్థానమగు ద్వారక యచ్చటి కెంతయో దూరమున లేదు. అర్జునుఁ డిచ్చటనున్నాఁడని విని శ్రీకృష్ణుఁడతనిఁ జూడవచ్చెను. అర్జునుఁడుఁ గృష్ణుని కెదురేగి తీసికొనివచ్చెను. వారిద్దఱుఁ బరస్పర కుశలప్రశ్నములు చేసికొనిరి. ఈసందర్భమున నర్జునునకు సుభద్రయం దనురాగము కలదని కృష్ణుఁడు కనిపట్టెను. సుభద్ర కృష్ణుని చెల్లెలు.

శ్రీకృష్ణుఁ డర్జునునభీష్టముఁ దీర్పఁదలచి «యర్జునా! నీవు నాతో ద్వారకకు రమ్ము. అచ్చటఁ గొన్నాళ్లు గడపి పోవచ్చు» ననెను. అర్జునుఁడు సన్యాసివేషమున ద్వారకకు వచ్చెను. శ్రీకృష్ణుఁడతనిం బురబాహ్యమున రైవతకాద్రికందరమున నొకచో నుంచెను. అంతఁ దానొకఁడె యింటికివచ్చి మఱునాఁడు రైవతకోత్సవ మని యందఱకుఁ జెప్పెను.

ద్వారకాపురవాసులందఱు రైవతకోత్సవమునకు వచ్చిరి. యాదవాన్వయముఖ్యు లద్రిపూజఁ జేయ బయలుదేరిరి.

అంతఃపురకాంతలును సుభద్రాసహితముగ సమూల్య మాల్యభూషణాంబరముల ధరించి యుత్సవముఁ జూడవచ్చిరి. అంతకుమున్నే శ్రీకృష్ణుఁడర్జునునొద్దకు వచ్చెను. యాదవులకు మునులయందు భక్తివిశ్వాసములు మెండు. అర్జునుఁ డొకయతి యనుకొని యతనికందఱుఁ గాంతాసమేతులై నమస్కరించిరి. సుభద్రయు నతనికి వందనమొనరించెను. అప్పుడాయువతీమణిం జూడ నతనికవకాశము దొరకెను.

ఉత్సవానంతర మందఱింటికిఁ బోవునపుడు బలరామాదు లర్జునునిఁ జాతుర్మాస్యనివాసము దమయింటం జేసికొనఁ బ్రార్థించిరి. ఆతఁడును వారితో ద్వారకకు వచ్చెను. వా రాతనికొక యుద్యానమున విడిది యేర్పఱచి, భోజనాద్యుపచారములు చేయ సుభద్రను నియమించిరి. కొంతకాలమున కాను మారీమణి యాయతి యర్జునుఁడని తెలిసికొనెను. సుభద్రయు నిదివఱ కర్జునునందు బద్ధానురాగయై యుండెను. క్రమక్రమముగా వారికింకను మోహము పెరిగెను.

బలరామాదు లామెను వేఱొకచో వివాహప్రయత్నములు చేయుచుండిరి. శ్రీకృష్ణుఁడు వీరిం గెలుపు టెట్లో యని యాలోచించెను. తనయభిప్రాయమాతఁడు రుక్మిణీసుభద్రలకుఁ జెప్పి బలరామాది యాదవులను దూరముగఁ బంపునుపాయము జేయఁదలఁచి "యంతర్ద్వీపమున శివోత్సవమని" చాటించెను. అందఱు నుత్సవమునకుఁ బోయిరి. ఆసమయమున

నర్జునుఁడు దనప్రియురాలి రథమునం దిడికొని పురపాలకుల నవలీలఁ బాఱఁదోలి సముద్రమునీఁది, యావలిగట్టునఁ గృష్ణుడుంచిన భటులతో నింద్రప్రస్థమునకుఁ బరుగెత్తెను.

దుర్గపాలకు లంతర్ద్వీపమునకు వచ్చి సుభద్ర నెవ్వరో కొనిపోయిరని చెప్పిరి. యాదవబలములన్నియు నర్జునుని వెంబడించెను. వారు వచ్చిచూడ రథముననున్నవాఁ డర్జునుఁడని తెలిసినతోడనె వారందఱు వెనుకకుఁబోయిరి. సుభద్రకర్జునుని కంటె నెక్కుడుపురుషుని దెచ్చెదరా ?

అర్జునుఁ డింద్రప్రస్థసమీపమున నిల్చెను. ద్రౌపదికతని యం దనురాగ మధికము. తా నింకొకతెనుఁ బరిణయమయ్యెనని యెఱిఁగిన నామె తన్నుం దనభార్యను శపించునేమోయని యాతఁడు భయపడెను. కావున నీవుముందుగాఁ గోపబాలికలతోఁ బోయి ద్రౌపదికి నమస్కరింపుము. దాన నామె నీయందు దయగలదగును. నేను వెనుకనుండి వచ్చెదనని సుభద్రకుఁ జెప్పిపంపెను.

సుభద్రయు నంతఃపురమునకుఁబోయి ద్రౌపదికి నమస్కరించెను. ద్రౌపది సంతోషించి "నీభర్త శత్రువులను జయించుగాక. నీవు వీరమాత వౌదువుగాక" యని దీవించెను. పదపడి నామె కుంతికిని బెద్దలకు నమస్కరించి యాశీర్వాదములందెను. అర్జునుఁడు నింటికివచ్చి తనచరిత్రమంతయుఁ జెప్పి యందఱకు నానందముఁ గలిగించెను. శ్రీకృష్ణబలరాములును

దము మఱదినిఁ జెల్లెలంజూడనచ్చిరిఁ యుధిష్ఠిరుఁడు వారల నెంతయు గారవించెనుఁ

ఉ. ఆనకదుందుభిప్రభృతియాదవులుం గురుముఖ్యులున్ మృదం
గానకదుందుభుల్ సెలఁగ సత్యనురాగముతో నిరంతర
శ్రీనుతు లొప్పనుత్సవముసేసిరి సప్తదినంబు లిష్టస
న్మానములన్మహీసురసమాజ సమీహితపూజనంబులన్‌ఁ"

సుభద్రార్జునుల వివాహానంతరము శ్రీకృష్ణ బలరాములు చెల్లెలికి మఱఁదికి సమూల్యవస్తువాహనము లిచ్చిరి. పిమ్మట బలరామాదియాదవులు ద్వారకకుఁ జనిరి. శ్రీకృష్ణుఁడు మాత్రము మఱఁదితోఁ గొన్నాళ్ళు గడపఁదలఁచి యింద్రప్రస్థమున నిల్చెను.

---

# ఎనిమిదవప్రకరణము.

---

ఖాం. డవదహనము.

శ్రీకృష్ణార్జును లింద్రప్రస్థమున మనోహరవిహారములఁ గాలముఁ గడపుచుండిరి. ఇంతలో వేసవికాలము వచ్చెను. ఎండలు తీక్ష్ణము లయ్యెను. జనులకు శీతలజలములందుఁ జలువపందిరులందు సన్నచీరలందును జక్కెరపానకములందును వ్యామోహమయ్యెను.

కావమందు లా యెండలలో యమునాజలముల నీదుచు, నదీతీరనికుంజముల మెలఁగుచు వినోదముననుండిరి. వా రొకనాఁడు వేఁటాడి స్నానముచేసి యొకపొదరింటఁ గూర్చున్నవేళ వారిదగ్గఱ కొకముసలిబ్రాహ్మణుఁ డేతెంచెను. వానితల వణఁకుచుండెను. తొక్కలు వ్రేలాడుచుండెను. ఏదియో దుర్భరవ్యాధిబాధచే వానిమొగము వికృతముగ నుండెను.

వానిఁ జూచి వారు లేచి నమస్కరించి “అయ్యా! మీ రేలయిచ్చటకువచ్చితిరని యడిగిరి. ఆమాటవిని, యతఁడు “నృపకుమారులారా! నాకుఁ జాలనాఁకలి యగుచున్నది. భోజనము పెట్టింపుఁడని” యడిగెను. వారును “అయ్యా! భోజనమునకు మీ కిష్టమైనపదార్థము లేమి? యని యడిగిరి. అంత నాబ్రాహ్మణుఁడు “నేనగ్నిదేవుఁడను. పూర్వము శ్వేతకియను భూపతి చేసిన దీర్ఘయాగమునఁ ద్రావిన నేయి నాకగ్నిమాంద్యము చేసినది. బ్రహ్మదగ్గఱకుఁబోయి నాయవస్థఁ జెప్పుకొన నాతఁడు ఖాండవారణ్యమున మహౌషధులనేకములున్నవి. వానిం దినెదవేని నీవ్యాధి కుదురునని చెప్పినాఁడు. ఆ వనము నింద్రుఁడు పాలించుచున్నాఁడు. అందాతనిభక్తుఁడగు తక్షకుఁడున్నందున నేను దానిం దినఁబోవునపుడెల్ల మేఘములఁ బంపి వర్షము గురియించుచుండును. మఱియు నింద్రవనపాలకులు నాకు విఘ్నముఁ గలిగించుచుందురు. మీ

రావనపాలకులఁ బాఱఁదోలిన నేను నాయక్కఱఁ దీర్చుకొనెద
నని చెప్పెను. శ్రీకృష్ణార్జునులు హుతాశనునకు సాయము
జేయఁదలఁచిరి కాని వారి కాయుధములు లేనందున నప్పుడా
ఖాండవమునకు రాఁజాలమనిరి. ఆమాటల కగ్నిదేవుఁడు
“మీకు సందేహము వలదు. నేను వరుణునడిగి యొకదివ్యశరా
సనము నక్షయతూణీరయుగ్మముం దెచ్చితిని. ఇవి యర్జునున
కిచ్చెదను. ఇదె చక్రాయుధమును గదయు నీకిచ్చెదను” నా
తోఁ దక్షిణముదండ”ని హెచ్చరించెను. అగ్నిదేవుఁడిచ్చిన
యాదివ్యశరాసనమర్జునుఁ డెప్పుడు దనప్రాణపదముగఁ జూచు
కొనుచుండువాఁడు. ఇదియె గాండీవమని మహాభారతమునఁ
జెప్పబడినది.

ఈవిధముగ నాయుధములు సంపాదించి కృష్ణార్జును
లగ్నిదేవునితోఁ ఖాండవవనమునకుఁ జనిరి. వారచ్చట నిలిచి
“దేవా! హవ్యవాహనా! మేము సిద్ధముగానున్నాము.
నీపనిఁ దీర్చుకొను” మని మ్రొక్కిరి. అంతలోనె ఖాండవమం
టుకొనెను. ఇంద్రునివనపాలకులు పరుగుపరుగున వచ్చిరి.
వారినందఱఁ గృష్ణార్జునులు వెనుకకుఁ బాఱఁదోల వారేగి
యింద్రునితోఁ జెప్పికొనిరి. ఇంద్రుఁడు ప్రచండకోపఘూర్ణమాన
మానసుఁడగుచువచ్చి నానాదిశలనుండియు మేఘములఁ జేరఁదీ
సి కుంభవృష్టిఁ గురిపింపఁ జొచ్చెను. అర్జునుఁ డక్షయతూణీర
యుగ్మమున నొకచేయియు, గాండీవమున నొకచేయియు,
నేవేళనెచ్చటనున్నదో విల్లెప్పుడువంగినదో తెలియకుండు

నట్లుంచుచు బాణములు వదలుచుండ, పై కెగురునవియుఁ, గ్రిందికిజాఱునవియు, నడ్డముగఁబరచునవియు నగుశరపరంపరల ఖాండవమునకంతకు నొకకప్పేర్పడెను. వర్షమంతయు నాకప్పు పైనుండి క్రిందికిజాఱిపోయెనేకాని లోని కొకచినుకైన రాల లేదు. కృశానుఁడిష్టమువచ్చినట్లు నానాజంతుసంతానములతో వనమంతయు భక్షించెను. ఆజీవప్రళయమున దానవవిశ్వకర్మయైన మయుఁడు పాండవమధ్యముని శరణుఁ వేఁడి ప్రాణముఁ గాచుకొనెను. తక్షకు నింద్రుఁడు తప్పింప వాఁడు కురుక్షేత్రమునకుఁబోయెను. వీరిద్దఱుం దక్కఁ దక్కినవనమంతయు నశించెను.

---

# తొమ్మిదవప్రకరణము.

---

యుధిష్ఠిరునివైభవము.

ఖాండవదహనానంతరము శ్రీకృష్ణపార్థులు మయుం దోడ్కొని యింద్రప్రస్థమునకుఁ బోయిరి. వారు ధర్మరాజునకు మయునిఁ జూపించి వాఁడు తమకుదొరికినవిధమంతయుఁ దెలియఁజెప్పిరి.

కొన్నాళ్లైనవెనుక ధర్మరాజు కొలువున నిల్చి వాఁడు ,,రాజా! మీరు నాకుఁ బ్రాణదానము చేసితిరి. మీకు నేను ప్రత్యుపకారము చేయుపాటివాఁడఁ గాను. అయిన నాచేతి

లోనిది కావున మీకేదైన నొకయద్భుతశిల్పముఁ జేసెద నాజ్ఞా పింపు"మని విన్నవించెను. యుధిష్ఠిరుఁడు గొంతసేపాలోచించి యేమియుఁ దోఁచక శ్రీకృష్ణునే దైన నపూర్వగృహరచనావసర ముఁ గల్పింపుమని చెప్పెను. శ్రీకృష్ణుఁ డాలోచించి, "మయా! యుధిష్ఠిరుని వైభవమునకుఁ దగినసభ రచింపుమని" యాజ్ఞాపించెను. మయుఁ డాతనిమాటలు విని సంతోషముతో "మంచి మాట చెప్పినారు. పూర్వము వృషపర్వున కొకసభ చేయవల యుననిఁ నే ననేకరత్నపరికరములు సమకూర్చి కారణాంతరముల చేఁ జేయలేక మైనాకపర్వతమున బిందుసరం బను కాసారము నందవియన్నియు దాఁచియుంచితిని. వానితో నింద్రసమానుఁడై న యీ యమసూనున కొకవిమానము రచించెద"నని చెప్పెను.

పిమ్మట మైనాకపర్వతమున కేగి కోయింబనల్లెడ తెలిపి లేక కృషిఁ జేసి మయుఁ డపూర్వమగు నొకవిమానముఁ గట్టెను. వానినేస్వమియోకాని గోడలయందలిచిత్తరువులు నేలమీఁద ను, నేలమీఁదిచిత్తరువులు గోడలమీఁదను ప్రతిఫలించుచుండె ను. దానియందు జలాశయములు పెట్టెనుగాని, ఆలన్నియు మెఱుఁగు పెట్టినందున జలస్థలవిభాగములు తెలియఁబడకుండెను. ద్వారములేని చోట ద్వారమును ద్వారముగల చోట గోడయు. గనిపించుచుఁ జూచువారలను మతిభ్రమము చేయుచుండెను సభ పూర్తియైనంత మయుఁడు దానిని రాక్షసులచే మోపించి తెచ్చెను. అంతనొకసుముహూర్తమునఁ బాండవపురోహితుఁ

డైన ధౌమ్యునియాశీర్వాదములతో ధర్మనందనుఁడు సభా మందిరప్రవేశముఁ జేసెను.

అంతనొకనాఁడు నారదుఁడు పాండవులఁ జూడవచ్చెను. పాండవులును ద్రౌపదియు నాదివ్యమునికి నమస్కరించి యుచితాసనమునందుంచి పూజలుచేసిరి. నారదుఁడు వారినందఱఁ బరమానందమునఁ జూచి యాశీర్వదించి యనేకనీతు లుపదేశించెను. ప్రశంగవశమున నతఁడు ,,యుధిష్ఠిరా! స్వర్గలోకమున నీతండ్రి సుఖముగ నున్నాఁడు. ఆయన నీవు రాజసూయము చేసిన బాగుండునని నాతో నొకప్పుడు చెప్పినాఁడు. రాజసూయమున నీకీర్తినందఱుఁ జెప్పికొందురని'' చెప్పి తనత్రోవ నేగెను. నారదునిమాటలు వినఁగ ధర్మరాజునకు రాజసూయము చేయవలయునను కోరిక జనించెను. ఆయజ్ఞమునకుఁ దగిన ప్రయత్నములు చేయుచు నీలోన శ్రీకృష్ణుని రమ్మని వార్త నంపెను. శ్రీకృష్ణుఁడు వచ్చినంతనె యుధిష్ఠిరుఁడతనితోఁ దనపూనిక దెలియఁజెప్పెను. శ్రీకృష్ణుఁడును, ,,ధర్మరాజా! రాజసూయము చేయఁదగినదె. ఐనను రాజులందఱు నీయందాదరముగలవారనుకొనరాదు. మగధాధీశ్వరుఁడగు జరాసంధుఁడు చాల బలవంతుఁడు. వాఁడు రాజులనందఱ నోడించి తనరాజధానియైన గిరివ్రజమున బంధించి దినమునకొక్కని బలియిచ్చుచు భైరవపూజ చేయుచున్నాఁడు. వానిని జయించినఁ గాని నీవీయజ్ఞము చేయఁజాలవు'' అని చెప్పిన ధర్మరాజు ,,మనబలము లాతని జయింపఁజాలవా''యని యడిగెను. అంతఁ గృష్ణుడు

"వానినెవ్వరుజయింపలేరు. వానిపురద్వారమున మూడు భేరులు కలవు. శత్రువు లెవ్వరైనఁ బట్టణములోనికిఁ బోవునప్పుడవి తమంతఁదామె మ్రోగును. వానిసేనానాయకులుం జాలనేర్పరులు. అయినను భీమార్జునులు నాతోవచ్చిన యెడల వానిం జంపునుపాయము చెప్పెద"ననెను.

శ్రీకృష్ణునిమాటలు వినినతోడనె భీమార్జునులుత్సాహమునఁ బొంగి జరాసంధుని వధింపబయలుదేరిరి. అతిశీఘ్రముగ వారు గిరివ్రజమునకుఁబోయి పురబాహ్యముననున్న భేరులఁ జింపి తిన్నగ జరాసంధుని సౌధమున కేగిరి. అప్పటికర్ధరాత్రమయ్యెను. ఇంకను బ్రాహ్మణులు భోజనము చేయుచుండిరి. జరాసంధుఁడు పూజయొనరించుచుండెను. అతిథులింటికి వచ్చిరని యాతఁడు వేవేగవచ్చి వారికర్ఘ్యపాద్యములీయఁ బోయెను. వారవి నిరాకరించిరి. అప్పుడు శ్రీకృష్ణుఁడుగంభీరముగ, "రాజా! మేము నీయింటికి భోజనమునకు రాలేదు. నీదుర్మార్గములన్నియుఁజూచి యిట్టియధర్మము దేశముననుండఁజూచుచున్నవారికి పాపమే కావున నీకుఁజెప్పవచ్చితిమి. భూతదయాపరుఁడవై సాత్త్వికపద్ధతి నీశ్వరునారాధించిన మోక్షము వచ్చును గాని ఘోరముగ మనుష్యుల బలియిచ్చి భైరవపూజఁ జేసినవచ్చునా? నీవు బలియిచ్చుటకై చెఱపట్టినరాజులను విడిచిపెట్టుము లేదా మాలోనొకనితో మల్లయుద్ధము చేయు"మని నిరోధించెను. జరాసంధుఁ డామాటలువిని భైరవార్చనకై పోఁచియుంచిన వీరిని నేను విడువను, మీరుకోరినటుల మీలోనొక

నితో యుద్ధము చేసెద'నని చెప్పి భీమునాకృతిఁ జూచి యాతఁడు తనకుఁదగినవాఁడని తెల్పి యుద్ధమునకు సిద్ధపడెనుఁ వారిద్దఱుఁ దగిన సాధనములదాల్చి యుద్ధమునఁ నొండొరుఁ దలపడిరిఁ ఒకరి కొకరు దీసిపోవక పొడుచుచుఁ దప్పించుకొనుచుఁ ద్రోయుచు డాయుచు నేడహోరాత్రములు యుద్ధము చేసిరిఁ జరాసంధుఁడలసెనుఁ అది కని పెట్టి శ్రీకృష్ణుఁడు వానికిఁ దెలుపి యీయవలదని భీమునికిఁ జెప్పి పెట్టెనుఁ భీముఁడా యేడవనాఁటి రాత్రి జరాసంధుని నిదురింపఁ బోనీక యలయించి యలయించి చంపెను. జరాసంధుఁడు చనిపోయినంత నతని రాజ్యము వీరికి స్వాధీనమయ్యెను. అయినను శ్రీకృష్ణుఁడు జరాసంధుని కుమారుఁడగు సహదేవుని సింహాసనం బెక్కించి, చెఱసాలలోనున్న రాజుల విడిపించెను. వారందఱు రాజసూయమునకు వచ్చెదమని వాగ్దానము చేసిరి.

జరాసంధుని మరణముతో రాజసూయ ప్రయత్నము సగమైనదని చెప్పవచ్చును. భరతఖండమునఁ గలుగు నితర భూపతులఁ దమకింకరులఁ జేయఁదలఁచి, ప్రబలసైన్యములతో నర్జునుఁడుత్తరమునకును, భీముఁడు తూర్పునకును, సహదేవుఁడు దక్షిణమునకును, నకులుఁడు పశ్చిమమునకును దండయాత్రలువెడలి భూపాలపాళి జయించి యపారధనముఁ దెచ్చిరి. రాజులందఱు రాజసూయమునకు వచ్చి ధర్మరాజునింటఁ బరిచర్య చేయ సమ్మతించిరి. ధృతరాష్ట్రునకుం దక్కిన పెద్దలకు

నాహ్వానపత్రికలంపి శ్రీకృష్ణుని రావించి, ధర్మరాజు యజ్ఞదీక్ష వహించెను

అమూల్యోపాయనములఁ దెచ్చి రాజులనేకులు యజ్ఞముఁ జూడ వచ్చిరి. రాత్రులుఁ బవలు భోజనశాలలు నిండియుండెను. ఎన్నిలక్షలమందివచ్చిరో లెక్క లేదు. పూర్వము హరిశ్చంద్రుఁ డొనరించిన రాజసూయముగూడ దీనికి సరిపడ దనిరి. ఆమహావసరమున సహదేవుఁడు వస్తుభాండారమును విడివియుండ్లనుఁ బరీక్షించుచుండె. కృపాచార్యుఁడు బ్రాహ్మణ దక్షిణలయందు శ్రద్ధపట్టెను. భీష్మద్రోణులు కృతాకృతముల విచారించిరి. ఆయవ్యయములు విదురుఁడు సంరక్షించెను. దుర్యోధనుఁడు నానాదేశాధీశులుం దెచ్చిన మణికనకోపాయనము లందుకొనెను. భక్ష్యభోగ్యములం దుశ్శాసనుఁడు పాలించెను. ఇట్లు సర్వబంధుసమాదరణాసంపద్విశేషముగ రాజసూయము నిర్విఘ్నముగాఁ బరిసమాప్తి చెందెను.

"ఉ. సమ్మదమందిచూచిరి ప్రసన్నత భూజనులెల్ల బ్రహ్మతే
జమ్మును రాజతేజమును సద్బహుభూషణరత్నరాజితే
జమ్మును విస్తరించుచు నిజద్యుతియొప్పఁగ మూర్తమైనధ
ర్మమ్మనఁ బోలెనున్న గుణమండితుపేక్షితుధర్మనందనున్"

# పదవప్రకరణము.

## రాజ్యభంగము.

రాజసూయానంతరము ధర్మరాజుడు భూపాలునందఱ వారువారు తెచ్చిన కానుకలకు మించిన బహుమానములిచ్చి పంపెను. ధృతరాష్ట్రుడు మొదలగువారు కొన్నిదినములైన పిమ్మట సంతోషముతోఁ దమదమ యిండ్లకేగిరి. అయిన నందుఁ గొందఱు నొచ్చుకొనిన సందర్భములు లేకపోలేదు. దుర్యోధనుఁ డొకనాఁడు సభామందిరమునఁదిరుగుచు, ద్వారము లేనిచోట ద్వారమున్నదని భ్రమించి యందుండిలోనికిఁ జొరఁ బ్రయత్నించినఁ బాపము! దెబ్బతగిలెను. అదియుఁగాక యాసమయమున నాతనియవస్థ మేడపైనుండి చూచి ద్రౌపది నవ్వెను. మఱియొకనాఁడు నీళ్లున్నచోట లేవనుకొని యాతఁడందు దిగఁబడినందున వాని బట్టలన్నియుఁ దడిసెను. మఱియు రాజులు దెచ్చియిచ్చిన మాణిక్యాద్యుపాయనములు చూడ వాని కన్నులు మిఱుమిట్లుగ్రమ్మెను. వేయేల? ధర్మజువైభవమాతని కసూయాస్పదమయ్యెను.

మనోవ్యాకులతతో నానాఁటికి నాతఁడు కృశించెను. మొగము తెల్లఁబోయెను. కన్నులు కళాహీనములయ్యెను. ఎముకలు బయలుపడెను. వానిమేనమామ శకుని యిది యంతయుఁ జూచి, "వత్సా! నీహృదయమును బాధించుచున్న

విచారము నాకుఁ గొంతఁజెప్పుము. చేతనైనసాయముచేసెద" నని చల్లగనడిగెను. దుర్యోధనుఁడు దీర్ఘనిశ్వాసముతో "మామ యయ్యా! యింద్రప్రస్థమునఁ బాండవుల వైభవము జూచినప్పటినుండియు నామనసునకుసుఖములేదు. ఆధనము! ఆనిత్యాన్నప్రదానము! నిరువదియేండ్లనుండి యవిచ్ఛిన్నముగ నడచుచున్నదే? మఱియెవరికైనఁజెల్లినదా? నేను నొకరాజనై యిది యంతయుఁ జూచుచునిలుచఁబడితినికదా" యనెను. శకునియు వానివీపు నిమురుచు "దీనికింత విచారమెందులకు? నాకుజూదమునఁ గలనేర్పునీవెఱుఁగుదువుగదా! ధర్మరాజునకు జూదమనన్నాసక్తి మెండు. నేనతనితో జూదమాడి యతని రాజ్యమంతయు గెలిచి నీకిచ్చెదను. మునుపర మీతండ్రిదగ్గఱకుఁబోవుదము. ఆతనితోఁజెప్పి ధర్మరాజుం దమ్ముల నిచ్చటికిఁ బిలిపించెద"మని చెప్పెను.

అంతశకుని తన మేనల్లుని వెంటఁబెట్టుకొని ధృతరాష్ట్రుని జేరి దుర్యోధనుని మనోవిచారమును, శరీరస్థితియుఁ జెప్పి "బావా! నీపుత్రునికిఁ దగినయుపాయము చేయవలయును. కుమారుఁడు వాడగుచున్నాఁ"డని తెలిపెను. ధృతరాష్ట్రుఁడును కుమారుని శరీరమంతయుఁ దడవిచూచి యులికిపడి "నాయనా! నీకింత విచారమేల. పాండవులకంటె నీవెక్కుడు భాగ్యశాలివి. నీయిష్టమువచ్చిన దక్షిణలిచ్చి నీవును యజ్ఞముచేయు" మనెను. దుర్యోధనుఁడూఱడిలక "నాయనా! నాకది పనికిరాదు. పాండవులసంపద నేను చూడలేను. శకునిధర్మజునితో

జూదమాడి వారిసంపద నంతయుఁ గెల్చినాకిచ్చును. దీనికి నీవు సమ్మతింపవలయును. అదియుఁగాక శత్రువుల గెలుచుట కు సూక్ష్మమార్గముష్నపుడది వదలుట తెలివిమాలినపని" యని బోధించెను. ధృతరాష్ట్రుఁడు కుమారుని యవస్థఁజూచి "నీయిష్టమువచ్చినట్లు చేయు" మనెను.

భీష్మవిదురులిది యెఱిఁగిరేనిఁ దన్నునిందింతురని తెలిసినవాఁడు కావున నతఁడు రహస్యమున నొకద్యూతగృహముఁ గట్టించెను. ద్యూతశాల సిద్ధమైనతోడనె మఱునాఁడు విదురునిఁ బిలిచి కుమారులందఱు స్నేహద్యూతమునఁ గాలముఁ గడపవలయునని కోరినారు. వారికొఱకీద్యూతశాల వేయించినాను. నీవింద్రప్రస్థమునకుఁజని పాండవులఁబిలిచి రమ్మని చెప్పెను. భీష్ముఁడిది తెలిసి వచ్చి, "దుర్యోధనుఁడు దుర్మార్గుఁడు. వానిహితులు ఘోరగ్రస్తులు. వీరిమూలమునఁ గులప్రళయము పుట్టును. అందును జూదము మహావ్యసనము. దుష్టవర్తనుఁడగు కుమారునొకని వదలి వంశమర్యాదఁ గాపాడు"మని ధృతరాష్ట్రుని మందలించెను. అంత ధృతరాష్ట్రుఁడు "పెద్దలు మీరందఱుఁగలుగ నేయపాయమురాదు. నామాటవిని పాండవులఁ బిలువనిం"డనెను. విదురుఁ డింద్రప్రస్థమునకుఁ బోయి పాండవులఁ బిలిచి తెచ్చెను. వారితో ద్రౌపదియు వచ్చెను.

మఱునాఁడందఱు భోజనములుచేసి కూరుచున్నసమయమున దుర్యోధనుఁ "డన్నా! కాలక్షేపమునకాటలేదు. కొంచెము సేపు జూదమాడుదమా" యనెను. ధర్మరాజామాట

లు విని "జూదము సప్తవ్యసనములలోనిది. దానివలన మహాపకారమగును. కావున జూదమాడ రాదని చెప్పెను. అంత శకుని "బ్రాహ్మణునివలె మాటాడుచున్నావు. రాజులకు జూదము కూడదా?" యనెను. అంత ధర్మరాజు రోషపరవశుఁడై "బలవంతముగ జూదమునకుఁ బిలుచుచున్నావుగనుక నేనును వెనుకాడను. జూదమెవరాడెదరో రం"డ నెను అంతదుర్యోధనుఁడు నేను నీతో నాడెదను. నాబదులు శకుని పాచికలఁ ద్రోయును. అతఁడు గెలిచిన నోడిననాదె" యని చెప్పెను.

శకునియు ధర్మరాజును జూదమాడఁజొచ్చిరి. ఒక పందెము తరువాత నొకటి ధర్మజుఁడోడిపోయెను. తనయాభరణములు, గుఱ్ఱములు నేనుఁగులు, రథములు, గోశాగారములు, రాజ్యము నన్నియుఁ బోయెను. వరుసవరుసఁ దమ్ములనైదుగురిఁగూడ నాతఁడొడ్డియోడిపోయెను ఇదియంతయుఁ జూచుచున్న భీష్మాదులందఱు వ్యాకులతఁగలంగిరి. ఇఁక నొడ్డుట కేమియుఁ గనఁబడక ధర్మరాజు తెల్లఁబోయి కూర్చుండెను. అంతశకుని నవ్వుచు "ధర్మరాజా! మఱచితివి, ధనము లేకేమి! స్వయంవరమున దొరికినపాంచాలి కలదుకదా. దానినొడ్డు"మనెను. ధర్మజుఁ డావేశమున మతిమాలి పాంచాలిని గూడ నొడ్డెను. శకుని పాచికల నిష్టమువచ్చినటుల వేయఁగలఁడు. ఈపర్యాయమును ధర్మరాజె యోడిపోయెను. సభయంతయుఁ గోలాహలమయ్యెను. పాంచాలి దుర్యోధనుని దాసియునిరి.

మహాగర్వమున దుర్యోధనుఁడు పాంచాలిం దెచ్చి తన యిల్లు తుడిపింపుమనెను. దుశ్శాసనుఁ డంతఃపురమునకుఁ బోయి ధర్మరాజు జూదమునఁ దన్నొడ్డి యోడుటయు దుర్యోధను నాజ్ఞయు ద్రౌపదికిఁ జెప్పెను. అప్పుడు ద్రౌపది "అయ్యా! ముందు నన్నోడెనో? లేక తన్నే యోడెనో?" చెప్పు మన దుశ్శాసనుఁడు నిశ్చయముఁ జెప్పలేక మరలివచ్చి సభలో నామె మాటలు చెప్పెను. దుర్యోధనుఁడు మరలఁ బ్రాతికామిం బిలిచి యామె యడిగిన ప్రశ్న మిచ్చటి సభయందు చెప్పెదరు సభకు రమ్మనుమని పంపెను.

ద్రౌపదియు విచారమునఁ గన్నీళ్లు విడుచుచు సభకు వచ్చి "సభాసదులారా! ముందు నా భర్త నన్నొడ్డెనో? తన్నే యొడ్డికొనెనో? చెప్పవలయును. నేను దుర్యోధనుని దాసి నైతినా నిశ్చయింపుఁడు" అని వేఁడెను. అందఱు ధర్మరాజె చెప్పవలయుఁ గాని మఱెవ్వరి కీధర్మసూక్ష్మము తెలియదనిరి. ధర్మరాజు విచారమునను, సిగ్గుచేతను మాటాడలేకపోయెను. అంత వికర్ణుఁడు లేచి, "ధర్మరాజునకు ద్రౌపదినొడ్డుట కధికారము లేదు. ఆమె ధర్మరాజున కొక్కనికే కాదు భార్య!" యనెను. సభవారును వికర్ణుఁ డాడినది న్యాయమనిరి.

దుర్యోధనుఁ డామాటలు చెవినిఁ బెట్టక, 'ద్రౌపది నా దాసి దాని నిచ్చటకుఁ గొని తెమ్ము. ప్రాతికామికి భీమునిఁ జూచి సభయము. నీవుపోయి లాగికొని రమ్మ'ని దుశ్శాసనునిఁ బంపెను. దుశ్శాసనునిఁ జూచి ద్రౌపది గాంధారి మఱుగునకుఁ

బోయి "నే నేకవస్త్రను నన్నుఁ దాఁకవలద"ని యేడ్చెను. కర్ణుఁ "డీమె యేకవస్త్రయైననేమి? విగతవస్త్రయైననేమి? అయిదుగురు మగలున్నదాని నెటులదెచ్చినఁ దేవచ్చు" ననెను. దుశ్శాసనుఁ డామె జుట్టుపట్టి యీడ్చికొనివచ్చెను.

దుర్యోధనుఁడు కర్ణునిమాట లుపశ్రుతిగ రాక్షసవృత్తి నుప్పొంగి "విప్పరా! చీరబట్ట" యని యఱచెను. ద్రౌపది మహాదైన్యమున భగవంతునిఁదలఁచి దేవా! నన్ను రక్షింపుము. నేను పతివ్రతనైతినేని నామానము సంరక్షింపు మని ప్రార్థించెను. దుశ్శాసనుఁడు పుట్టమూడ్చునరికి మఱియొక పుట్ట మడుగునఁ గానిపించుచుండెను. విప్పినబట్టలన్నియుఁ బెద్దమేటి యయ్యెను. దుశ్శాసనుఁ డేమియుఁ జేయలేక నిలిచెను. ఇది యంతయుఁజూచి భీముఁడుగ్రమూర్తియై నాభార్య నిటు లవమానించిన యీదురాత్మునిభుజములు బ్రద్దలుచేసి వేడినెత్తురు ద్రాగెద"నని గర్జించెను. సభాసదులందఱు "భీమసేనా! యిదికోపమునకు సమయముకాదు. శాంతింపుము"ని యతని నాపిరి. భీమసేను నాటోపముఁజూచి దుర్యోధనుఁడు నవ్వుచు తనతొడఁగొట్టి "ద్రౌపదినివచ్చియిచ్చటఁగూర్చుండు"మని పిలిచెను. భీముఁడుగ్రమూర్తియై నాభార్య నిటులఁ దొడపైఁగూర్చుండరమ్మని పిలిచిన వీనితొడలు విఱుగఁగొట్టి చంపెద నని యార్చెను. సభాజనులందఱు గొల్లుమనిరి. ధృతరాష్ట్రుని నిందించిరి. దుర్యోధనుని దిట్టిరి. భీష్మాదులను గూడఁ దూలనాడిరి. ఈవిధముగఁ గోలాహలములతో సభ ముగిసెను.

రాత్రి గాంధారికి నిద్దురపట్టలేదు. ఆమెకు దుస్స్వప్నము లెన్నియోవచ్చెను. పరమధార్మికులైన పాండవులను, వారికులాంగన నవమానించిన పాపమునఁ గులనాశనమగునని యామె గుండెలు దడదడలాడెను. ఆసాధ్వి ధృతరాష్ట్రునిఁ జేరి, "నాథా! పాండవులఁబిలిపించి, వారిరాజ్యము వారికిమ్ము! ద్రౌపదిని సంతోషపెట్టుము. లేనిచో మనమందఱము నాశనమౌదు"మని హితముఁజెప్పెను. ధృతరాష్ట్రుఁడుం బశ్చాత్తాపముఁజెంది ద్రౌపదినిఁబిలిచి "యమ్మా! నాకుమారులు చిన్నవారు తెలియక నిన్నవమానించిరి. వారినిక్షమింపుము. నేను నీకేదైనవరమిచ్చెద"ననెను. ద్రౌపది మామగారిమాటలు విని సంతోషించి "ధర్మరాజునకు దాస్యమువదిలింపు"మని కోరెను. ధృతరాష్ట్రుఁడు మరల "తల్లీ! యింకొకవరముఁ గోరు" మనెను. ద్రౌపది నాభర్తలందఱ దాస్యము వదిలింపు"మనెను. ధృతరాష్ట్రుఁ డామెకోరికను బ్రీతిమెయినదీర్పఁదలఁచి "యమ్మా! యింకొకవరము వేఁడు"మనెను. అంతద్రౌపది, "దేవా క్షత్రియాంగనలు రెండిటికన్న నెక్కుడువరములఁ గోరఁగూడ"దనెను. ధృతరాష్ట్రుఁ డామెధర్మబుద్ధికి మెచ్చి "నీకు మూఁడవవరము నీవుకోరకయె యిచ్చెదను. మీరాజ్యము మీకిచ్చెద" నని పిమ్మట ధర్మజాదిపాండవులఁబిలిచి వారిరాజ్యము వారికిచ్చి సంతోషపెట్టి యెప్పటిలాగున రాజ్యముచేసికొనుఁడని యింద్రప్రస్థమునకుఁ బంపెను.

దుర్యోధనుఁడు తండ్రి మొనరించినది చూచి సహింపఁ జాలక "తండ్రీ నీవు నేనొనరించినదంతయుఁ బాడుచేయు చుందువు. నీవు రాజ్యమిచ్చినావని భీముఁడు తనప్రతిజ్ఞ వద లునా? పాండవులుఁ దమపరాభవము మఱచెదరా ? వీరి నుపేక్షచేయుటవలన మనకుఁ బ్రాణహానియగును. వారినిమరల జూదమునకుఁ బిలువనంపుము. తరువాతఁజూచెద" నని తండ్రి నొప్పించెను ధృతరాష్ట్రుఁ డింకొకమాఱు పాండవులఁ దీసికొని రమ్మని ప్రాతికామింబంపెను. పాండవులును పెదతండ్రిని విశ్వసించి హస్తినాపురమునకు వచ్చిరి. మునుపటివలెనే శకుని ధర్మజుని జూదమునకు రమ్మనిపిలిచెను. బలవంతముగ నతని నకుఁ బిలిచినప్పుడు రాజైనవాఁడు రాననునా ? పాచికలు పట్టిపట్టి నప్పుడు శకుని "ధర్మరాజా ! మీరాజ్యమును రాజ్యమును ధృతరాష్ట్రుఁడు మీకు దానమిచ్చినాఁడు. కాన్పుప నవి యెత్తు టకుఁ దగవు. అందుచే మన మొకక్రొత్తపందెము పెట్టుకొం దము. ఈజూదమున నోడిన నీవును నీతమ్ములును న్యాయముగ బం డ్రెండేండ్లు వనవాసము పదుమూఁడవయేఁట నజ్ఞాతవాసము చేయవల యును. నేనోడిన దుర్యోధనాదులట్లు చేయు"దని యొప్పించెను. పాచికలు త్రోచిరి. అకటా ! విధి ! ధర్మరాజోడిపోయెను.

పాండవులు ద్రౌపదియుఁ బ్రతిజ్ఞాపూర్వకము వనవాసమున కుఁ బ్రయాణమై సర్వాభరణములుఁ బరిత్యజించి, నారచీర లు గట్టుకొని భీష్మాదికురువృద్ధులకు ధృతరాష్ట్రునకు గాంధారి కి నమస్కరించి చిన్ననాఁటనుండియుఁ జనినికొని, పట్టాభిషేక

మై దిగ్విజయముచేసి యింతటివారు లేరని యందఱుఁ బ్రశంసిం ప సంచరించిన హస్తినాపురమును వదలి మహాశోకమున ఘో మ్యానుగమ్యమానులై వారు చనిరి.

“చ. తడిసిన యేకవస్త్రపరిధానముతో విముక్తకేశియై
తొడరుచు దుఃఖభారమున ద్రౌపది పోయె మహాహవంబునం
బడిన నిజేశమిత్రహిత బంధుజనంబుల శోకవేదనం
గడుకొని యిట్టు లేగుదురు కౌరవభామినులంచుఁ దెల్పుచున్”

కుంతి విదురునింటనుండెను.

---

# పదునొకండవ ప్రకరణము.

---

## అరణ్యవాసము.

పాండవులరణ్యవాసమునకుఁ బోవుచున్నారని విని పౌరులందఱు వారిని వెంబడించిరి. ధర్మనందను నధర్మద్యూతమున నోడించి యరణ్యములకుఁ బంపుచున్న దుర్యోధను నేలుబడి సహించి యుండుటకంటెఁ బాండవులతో నరణ్యములకుఁ బోయి కాయగూరలు తిని బ్రతుకుట మేలని వారికిఁ దోఁచెను. ఈవిధమునఁ దనవెంటఁ బడుచున్న జనులనందఱఁ జూచి ధర్మరాజు, “మహాశయులారా! మీరు విచారింపవలదు. మేము మీదయచే మరలఁ బదమూఁడేండ్లకువచ్చి రాజ్యము చేసెదము. మాయందుఁ గనికరముంచి మరలిపొండని మొఱపో

వారిని బంపెను. కొందఱు బ్రాహ్మణులు తక్క నందఱు వెను కకుఁ బోయిరి.

ఇటులఁ బరమవిశ్వాసముసఁ దన్ననుగమించుచున్న బ్రాహ్మణులతోఁ బాండవులు ద్వైతవనమునందు నిలువనిశ్చయించుకొనిరి. పాపమా ద్విజులందఱుఁ గహనాంతరమునఁ గంద మూలములుఁ దెచ్చికొనఁ గష్టపడుచుండుటఁ జూచిన ధర్మరాజునకు మిగులదుఃఖము గలిగెను. ఇంద్రప్రస్థమునఁ బ్రతిదినమనేక బ్రాహ్మణులకు సంతర్పణము చేయుచుండి నేఁడు పదిమంది కాహారము పెట్టలేనందుల కతఁ డెంతయుఁ జింతించెను. ఆవిచారముపట్టఁ జాలకాతఁ డష్టోత్తరశతనామములతో సూర్య భగవాను నారాధించి తనకు వీరినందఱఁ బోషించు నుపాయము జూపుమని వేఁడెను ఆతని భక్తికి మెచ్చి సూర్యుఁడాతనికొక తామ్రపాత్రనిచ్చి 'రాజా! యీగిన్నె ద్రౌపదికిమ్ము. ఆమె చేతనున్నంతకాల మది యక్షయాన్నము నిచ్చు"నని యంతర్ధానముపొందెను ధర్మజుఁడటులె యాగిన్నెను ద్రౌపదికిచ్చెను. బ్రాహ్మణులకుఁ దమకుఁ గావలయునన్న మాగిన్నె బోషించి సంతనె పుట్టుచుండెను. దానిసాహాయ్యమున వారు సుఖముగఁ గాలక్షేపము చేయుచుండిరి.

పాండవు లరణ్యమునకుఁబోయిరని విని శ్రీకృష్ణుఁడు వారిఁ జూడ నేతెంచెను. కాంపిల్యమునుండి ధృష్టద్యుమ్నుఁడు వచ్చెను. వీరు పాండవులతోఁ గొంతకాలముండిరి. వారు దమ

యింట్లకుఁ బోవునపుడు సుభద్రను సుభద్రాకుమారుఁడగు నభిమన్యునిఁ గృష్ణుఁడు ద్వారకకుఁ గొనిపోయెను. ద్రౌపదికి నైదుగురు కుమారులుగలరు. వారిని ధృష్టద్యుమ్నుఁడు తనతోఁ గొనిపోయెను. పాండవులును, ద్రౌపదియు బ్రాహ్మణులతోఁ గలసి వనవాసము చేయుచుండిరి.

యుధిష్ఠిరుని హృదయ మనేకవిధములఁ బరితపించుచుండెను. ఆతని కేమియుఁ దోఁపక విచారమున నందందుఁ దిరుగుచుండెను. అరణ్యవాసమైన పిమ్మట నజ్ఞాతవాసము నిజముగ సమాప్తమైనను దుర్యోధనుఁడు తమకు రాజ్యమిచ్చునా? ఈయకున్న యుద్ధముతప్పదు! తమయన్నదమ్ము లైదుగురు కౌరవసేనల జయింపఁగలరా? ఈగతినాతఁడు సంతాపము చెందుచుఁ బిచ్చివానివలెఁ దిరుగుచున్న నొకనాఁ డతనికి వ్యాసుఁడు కానిపించి యతని నోదార్చి "నీవధైర్యము పొందనవసరము లేదు. ధర్మపరుఁడవుగావున నీకు జయమగును. నాయొద్దఁ బ్రతిస్మృతియను నొకవిద్యకలదు. నీకు దాని నుపదేశించెదను. దానిని నీవర్జునున కుపదేశించి వానిని దానిచే దేవతల నారాధింపుమనుము. వానికి దేవతలవలన దివ్యాస్త్రలాభము కలుగును. మీరు శత్రువుల సుఖముగా జయించెదరు" అని చెప్పియతని కావిద్యనుమంత్ర ముపదేశించి తనయాశ్రమమునకుఁ బోయెను.

వ్యాసుఁ డేగిన పిమ్మట ధర్మరాజర్జునునకుఁ బ్రతిస్మృతి నుపదేశించి, భవాది దిక్పాలుర దానిచే నారాధించి దివ్యా

స్త్రములు సంపాదింపుమని యాజ్ఞాపించెను. సోదరునాజ్ఞ ననుసరించి యాతఁడు తపస్సుచేయుట కింద్రకీలపర్వతమునకుఁ బ్రయాణమయ్యెను. భర్తలందఱిలో ద్రౌపది కర్జును నందెక్కుడనురక్తి. అర్జునునకు నామెయందనురాగమె. అయినను వారు కార్యసాధనముకై యొకరినొకరు కొంతకాల మెడఁబాసి యుండవలసెను. ద్రౌపది కన్నీరు నించుచు భర్తను సాగనంపెను.

గాండీవము నక్షయతూణీరములుఁ దనకు రక్షగా నర్జునుఁ డింద్రకీలపర్వతమెక్కి ముందునకు నిశ్చయముగ నడచెను. కొంతదూర మేగినతరువాత వెనుకనుండి "యాగు, మాగు" మనియొకధ్వని యాతని చెవులఁబడెను. వెనుకకుఁజూడ నొక చెట్టుక్రింద వృద్ధమునియొకఁడు కానిపించి "యాశరాసన మేమి? నీవేమి? యిచ్చటదానితో నీప్రవేశించుట యేమి? యనెను. అర్జునుఁడామునిమాటలువిని వినయముతో "నయ్యా! నేను తపోధనుఁడఁనుగాను ఆత్మరక్షకై బాణాసనతూణీరముల బూనితి" ననెను. అంతలో మునికిఁబదులుగ సహస్రాక్షులుం బర్వనిశానక్షత్రప్రభాభాసమానములై గానిపింప సురేశ్వరుఁడతనియెదుట నిలిచెను అర్జునుఁడును సాష్టాంగముచేసి "తండ్రీ! నాకు దివ్యాస్త్రములిమ్మని" వేఁడెను. ఇంద్రుఁడు కుమారునాదరించి, ముందుగ నీశ్వరునిదిక్పాలురనాశ్రయించి వారిచే వరములనుగైకొనుము. అటుపైన నేనుఁ జేయునది చేసెద" నని యంతర్ధానము చెందెను.

అర్జునుఁ డాచెట్టునీడను నిలిచి యీశ్వరునిగూర్చి తపము మొదలుపెట్టెను. ఈశ్వరుఁడతనిఁ బరీక్షింపఁదలఁచి మూకాసురుఁడను నొకరాక్షసునిఁ బంపెను.

చ. పశుపతి వోదెతుంచుగుచు భాసిలియూరుఁడు పందిరూపమై
దశదిశలన్నెలంగుచును దానటునుండిఁ ఘుర్ఘురించుచున్
దశనపురాపిడింబోడము దట్టపుటగ్నికణంబులన్ వనిన్
విశదమొనంగఁజేయుచును వేఁజనె నర్జునుఁ జీల్చునోయనన్
(శ్రీకృష్ణభారతము)

తనపైకిఁగోపముతో వచ్చుచున్న యాపంది నర్జునుఁ డేసెను. అంతలోనె యాప్రక్కనుండి మఱియొక బాణమూకిటి దేహమున నాటెను. అది చచ్చి నేలపైఁబడెను. వెనుకనుండి యొకకిరాతుఁడువచ్చి "సృపకుమారా! నేనుగొట్టఁబోయిన దాని నీవేలయేసితివి! నన్నవమానించెదవా? నాతో యుద్ధముచేయుమని యతనిఁ దాఁకెను. అర్జునుఁడు వెనుదీయక నిలచెను. వారిద్దఱు బాణవర్షములఁ గురిపించుకొనిరి. సామాన్యబాణముల కాకిరాతుఁడు లోఁగనందున నక్షయతూణీరముపయోగింపఁదలఁచిచూచిన నందొకబాణమైన లేకపోయెను. గాండీవమెత్తి వానింగొట్టఁబోవ వాఁడది చుల్కఁగా లాగికొనెను. గాండీవము పోయినందునఁ గోపమువచ్చి ద్వంద్వయుద్ధముచేయఁబోవవాఁడర్జునుని బిల్లవానినెత్తికొనినట్లెత్తుకొనెను. ఆకిరాతునిబాహుపీడనమున నర్జునుఁడు మూర్ఛపోయి నేలపైఁబడెను.

అతఁడు తెలివివచ్చిచూచునప్పటికిఁ గిరాతుఁడు నవ్వు చు నిలుచుండెను. అర్జునుఁడు మెల్లఁగ లేచి శివపూజచేసి కిరా తుని మరలఁ దాఁకవచ్చెను. వానిదగ్గఱకుఁబోవఁ దాను బూజచేసినదళములును బూవులుఁ గిరాతునితలపైఁ గానిపిం చెను. కిరాతుఁడు కాఁడు శివుఁడని యర్జునుఁ డాతని ననేకవిధముల స్తుతించెను. శివుఁడు నర్జునునందు దయవచ్చి తన నిజస్వరూపముఁ జూపి దివ్యాస్త్రము లుపదేశించి యంత ర్హితుఁడయ్యెను. తక్కినదిక్పాలురు నతని కనేకాస్త్రములిచ్చి రి. ఇంద్రుఁడును వచ్చి తనకుమారు నమరావతికిఁబిలుచుకొని పోయి దివ్యాస్త్రములుపదేశించి యతనిగాండీవమున నెన్నటికి నలిగిపోనిత్రాడును, తనువునకభేద్యమగుకవచమును, శిరమున సూర్యునివలెఁ బ్రకాశించు కిరీటమును, దేవదత్తమను శం ఖమునిచ్చి కొన్నాళ్ళచ్చటనుంచుకొని మరలఁ దనదివ్యరథ మున నతనిఁ దనసోదరులదగ్గఱకుఁ బంపెను. చిరకాలము తప స్సుచేసి దివ్యాస్త్రములు సంపాదించుకొనివచ్చిన సోదరుని జూచి వారు చాలనుప్పొంగిరి.

భీముఁడొకనాఁడు వేఁటకుఁబోయి రాత్రియైననింటికిరాఁ డయ్యెను. ద్రౌపదిధర్మరాజునకది చెప్పియాతనివెదకుమనిప్రా ర్థించెను. అతఁడుఁదమ్ముని వెదకివెదకి యెందునుగానక తుద కొక కొండగుహలోనికిఁబోయెను. భీముఁడచ్చటఁ గొండచి లువచేఁ జుట్టఁబడి పడియుండెను. ధర్మరాజు తమ్ముఁడు చనిపో

యెననుకొ నేను కాని భీముఁడన్నా! నన్ను విడిపింపుము. ఇఁక నా లసించినఁ బ్రాణము వ్రోవునని. ధర్మరాజప్పుడా యజగరముతో "సహిావల్లభా, వీఁడు నాతమ్ముఁడు. వీనిని వదలిపెట్టుము నీకుఁ గడుపునిండ నాహారముఁ దెచ్చిపెట్టెద" ననెను. పాము మాటాడక భీముని శరీరమునకు మఱింత గట్టిగఁ జుట్టుకొని "ధర్మజా! నీవు నేనడిగిన ప్రశ్నములఁ జెప్పెదవేని నీతమ్ముని వదలెదను. లేనిచో మింగెద" ననెను. ధర్మరా జజగర ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరము లీయ సమ్మతించెను.

అజగరమతని ననేకవిషయములడిగెను. యుధిష్ఠిరుఁడన్నిటికిఁ దగినట్లు ప్రత్యుత్తరములిచ్చెను. ఆపామతని వివేకముఁ నకు మెచ్చి భీముని వదలిపెట్టెను. భీముఁడీవలికి వచ్చునంతలోఁ బాము దివ్యతేజఃపటలవిరాజితుఁడగు నొక మహాపురుషుఁడై, యుధిష్ఠిరుముందు నిలిచి, "కుమారా! నేను మీవలెనె చంద్రవంశమునఁ బుట్టితిని. నాపేరు నహుషుఁడు. అనేక యాగములు చేసి ఘోరతప మొనరించి యింద్రుఁడనైతిని. నేనొకనాఁడు బ్రహ్మరథమునఁ బోవుచు, జరాభారమున నగస్త్యుఁడు మెల్లఁ గనడచుచుండఁ గోపించి యతనిం దన్నితిని. ఆమహర్షి నాగర్వముఁ జూచి యజగరమవగుమని శపించెను. నేను దక్షిణమెపల్లకి నుండి క్రిందఁబడితిని ఆశాపము సహింపనేరక శాపమోక్షణముం దయచేయుమని ప్రార్థింప నతఁడు కరుణామయుఁడై, "నీకు నకు ధర్మరాజు వచ్చును. వానివలన ను త్తమజ్ఞానము తెలి

సికొని శాపమోక్షణము పొందు" మని చెప్పెను. నాయనా! నేఁడు నీవలన నాకుత్తమజ్ఞానముగలిగినది. నేనిఁక స్వర్గమునకుఁ బోయెద దయయుంచుమని నహుషుఁడమరలోకమున కేగెను. ధర్మజుఁడు తమ్ముని వెంటఁబెట్టుకొని తనకుటీరముఁ జేరెను.

పాండవులవృత్తాంతమంతయు దుర్యోధనుఁ డరణ్యము నుండి వచ్చినయొక బ్రాహ్మణునివలన వినెను. అర్జునుఁడు తను వుతోనె స్వర్గమునకుఁబోయి యింద్రునివలన దివ్యాస్త్రలాభ ముఁ బొందెనని విని మిగులదుఃఖించెను. అజ్ఞాతవాసమైన త రువాత వారురాజ్యమిమ్మందు రేమోకదా ? అప్పుడు వారిని గెలుచుట కష్టము. ఇప్పుడెవారి నరణ్యములఁబట్టుకొని సంహ రించినమేలు. అదియుఁగాక పూర్వము సభయందుఁదన్నుఁజూచి నవ్విన ద్రౌపదినొకమాఱు హేళనము చేయుటకన్నఁ బరమా నందముకలదా? ఇదియంతయుఁదలఁచి దుర్యోధనుఁడు తన స్నేహితులతో నాలోచించెను.

వారందఱుఁ గలసి యొకయుపాయముఁబన్నిరి. ద్వైత వనమున ధృతరాష్ట్రుని పశువులుమేయుచుండెను. వానింజూ చివచ్చుటకనుజ్ఞ యిమ్మని ధృతరాష్ట్రునడిగిరి. ధృతరాష్ట్రుఁడు "చాలు చాలు నిదివఱకు సంభవించినయపకీర్తిచాలు. అచ్చటఁ బాండవులున్నారు. మీరువారికపకారము చేయఁజూచెద" ర నెను. అంత దుర్యోధనుఁడు, మేము వారిపొంతకుఁబోవ"మని వాగ్దానముచేసెను. తర్వాత దుర్యోధనుఁడు కొందఱు సైనికు

లతోఁ గర్ణాదులు వెంటరా నరణ్యమునకు వచ్చెను. ఆవనమునం దొకగంధర్వకాసారము గలదు. ఆ చెఱువుగట్టునఁ జిత్రరథుఁ డను గంధర్వుఁడొకఁడీవఱకె వచ్చిదిగెను. దుర్యోధనుఁ డాస మీపమున నె విడిసెను.

పగలంతయు దుర్యోధనుఁడును వానిపరివారము నిష్టము వచ్చినటుల విహరించిరి. సాయంకాలమునకు దుర్యోధనుని భటులుకొందఱు చిత్రరథునిశిబిరముఁ జూచి తమరాజునకుఁ జెప్పిరి. దుర్యోధనుఁడు గొందఱుభటులను జిత్రరథునవ్వలకుఁ బొమ్మని చెప్పఁబంచెను. చిత్రరథుఁడామాటలకుఁ గోపించియాసైనికులఁ జెఱపట్టెను. దుర్యోధనుఁడు సేనతోవచ్చి గంధర్వులముట్టడించెను. ఆరెండుసేనలకును ఘోరముగఁ బోరాటము జరిగెను. ఆయుద్ధమున నిలువలేక కర్ణుఁడు పాఱిపోయెను. సేనయంతయుఁ జెల్లాచెదరయ్యెను. చిత్రరథుఁడు దుర్యోధనుని బట్టి తనరథమునఁ బెట్టుకొని యాకాశమున కెగిరెను. దుర్యోధనుని యంతఃపురకాంతల గంధర్వులు చెఱపట్టిరి. వానిపరిజనులలోఁ గొందఱు ధర్మరాజునొద్దకుఁబోయి దుర్యోధనునిఁ గాపాడుమని వేఁడుకొనిరి. ఆసమయమున ధర్మరా జొకయజ్ఞము చేయుచు దీక్షయందున్నందునఁ దనతమ్ముల వారికి సాహాయ్యముచేయ నియమించెను. భీముఁడు "వారికేలసాహాయ్యము చేయవలయును? మనకుఁ జేసినయుపకారమున కా?" యనెను ధర్మరాజామాటలు విని "భీమసేనా! దుర్యోధనాదుల కాం

తలఁ జెఱపట్టిన భరతవంశమునకంతకు నవమానముకాదా. గృహకలహముఁ బెలఁచియిట్టి పరాభవముగలుగఁ జూచుచుండ వలసినదేనా" యనిమందలించెను. అంత భీమార్జునులు గంధర్వులఁ దాఁకిరి. ఆకాశమార్గమునఁ బోవుచున్న చిత్రరథుని నర్జునుఁడనేకబాణములేసియరికట్టి చెఱపట్టెను. అంతఁజిత్రరథుఁడు "పార్థా! వీఁడుమిమ్ము వెక్కిరింపవలయునని వచ్చినాఁడు. ఇంద్రుఁడని కనిపెట్టి వీనికి గర్వభంగముచేయ నన్నంపినాఁడు. వీనినిఁ గొనిపోని" మ్మనెను. అర్జునుఁడు "వీనిని విడిపింపుమని మాయన్నగారియాజ్ఞ మనమిద్దఱమాయనదగ్గఱకుఁబోవుదము. ఆయన చెప్పినటులఁ జేయవచ్చు"ననెను. అప్పుడా చిత్రరథుఁడు దుర్యోధనుని కాళ్లుచేతులుఁగట్టి యుధిష్ఠిరుముందరఁ బెట్టి "ధర్మరాజా! వీఁడుమిమ్ము వెక్కిరింపవచ్చినాఁడు. వీనినిఁ గరుణింపవద్దని" చెప్పెను. యుధిష్ఠిరుఁడు "గంధర్వరాజా, నన్నానందింపఁ జేసెదవేని వీనిని వదలు మనెను. చిత్రరథుఁడును వానిని వదలిపెట్టెను. అంత దుర్యోధనుఁడు లజ్జావనతవదనుఁడగుచు మరలిచని కర్ణునిఁగలిసికొనెను. కర్ణుఁడాతనిఁ జేరి "దుర్యోధనా! నీపరాక్రమముఁ బొగడఁగలనా గంధర్వులనోడించివచ్చితి" వనెను దుర్యోధనుఁడా మాటలువిని "కర్ణా! నాపాటు లేమని చెప్పను. చిత్రరథుఁడు నన్నుఁ జెఱపట్టికొన నర్జునుఁడు విడిపింపవలసి వచ్చెను. పాండవుల వెక్కిరింపవలయుననివచ్చి నేనే పరాభవముపాలుగావలసెను. నాకు రాజ్యమువద్దు. నేనికఁ బ్రదుకఁ

జాలను. ఇచ్చటనె ప్రాయోపవేశము చేసెద"నని కంట సీళ్లు పెట్టుకొనెను. అంతఁ గర్ణుఁడాతనినెమ్మదిగ బ్రతిమాలుకొని హస్తినాపురమునకుఁ గొనిపోయెను.

---

# పండ్రెండవప్రకరణము.

---

## అజ్ఞాతవాసము.

అరణ్యమునందుఁ బాండవు లనేకకష్టములు పడినను వారికి దానికిఁ దగినలాభముగలిగెను. వారిచ్చట మహామును లనేకులు కనఁబడిరి. వారలవద్దనుండి ధర్మరాజు నానాధర్మము లు తెలిసికొనెను. పురాణేతిహాసములు తెలిసెంగె. ఒకొక్కప్పుడు దేవసాక్షాత్కారమును వారికిలభించెను. ఇటుల మెల్ల మెల్లఁ గ నరణ్యవాసవత్సరములు సమాప్తి కావచ్చెను.

అప్పుడు ధర్మరాజు బ్రాహ్మణులనందఱుఁ దమతమ గృహములకుఁ బొమ్మని వేఁడుకొనెను. ధౌమ్యునిఁ దమయగ్ని హోత్రములు సంరక్షింపఁగోరెను. తక్కిన పరిచారకుల హస్తినాపురమునకుఁబంపెను. ఇటులందఱుఁ జనినతర్వాత నతఁడనుజులతోఁ దామెచ్చట నజ్ఞాతవాసము చేయదగునని యా లోచించెను. చూడఁజూడ మత్స్యదేశ మనుకూలముగ నున్న

ల్లుత్రోఁ జెను. ఇఁక నెవ్వరెటులఁ దమ్మెన్వ్యరెఱుఁగక యుండు లాగునఁ బ్రవర్తింపవలయునో నిశ్చయించుకొనవలయును.

ధర్మరాజు తాను బ్రాహ్మణవేషముఁదాల్చి కంకుఁడను నామమునమత్స్యరాజుఁ గొల్చెదననెను. భీముఁడు, ,, నేను బాగుగ వంటచేయఁగలను. వలలుఁడని పేరుపెట్టుకొని విరటుని సేవించెద''ననెను. అర్జునుఁడు ,, నేనింద్రునితో స్వర్గమునకుఁ బోయినప్పు డచ్చట నూర్వశి నన్నుమోహించి నేనామె యందాస క్తిఁజూపనందునఁ గోపించి నపుంసకుఁడవు గమ్మని నన్ను శపించెను. ఇంద్రుఁడు నాయలౌల్యమునకు సంతోషించి యాశాపమజ్ఞాతవాసవర్షమున నుపయోగించునట్లనుగ్రహించెను. కావునఁ గేడిసై విరటుని బిడ్డలకు నాటపాటల నేర్పుచుందును. నాపేరు బృహన్నలయని చెప్పెద''ననెను. నకులుఁడు నాకశ్వశిక్షయందుఁ బ్రజ్ఞకలదు. దామగ్రంథియను పేర విరటుని గుఱ్ఱములఁ గాచుచుండెద"ననెను. సహదేవుఁడు, ,, నేను పశుచికిత్సయందారి తేరినవాఁడను. కావున నేను తంత్రీపాలుఁడనుపేర నాతని పశువులఁ గాచుచుఁ గాలక్షేపము చేసెద''ననెను ద్రౌపది, ,, నేను సైరంధ్రివేషముఁదాల్చి విరటుని రాణికిఁ బనులుచేయుచుందును. నాపేరడిగిన మాలిని యని చెప్పెద''ననెను.

ఇటుల వారందఱుఁ జేయదలచిన వృత్తులు నిశ్చయించుకొని విరాటనగరమునకుఁబోయిరి. అటులఁబోయి నగరోత్త

రభాగమున స్మశానవాటికయందొక పెద్దజమ్మిచెట్టుక్రిందికి వచ్చిరి. దానిశాఖ లల్లిబిల్లిగ నల్లుకొనిపోయెను సాలెగూళ్లు ముద్దలుముద్దలై వ్రేలాడుచుండెను. అందుఁబట్టపవలె దయ్యములు నాట్యమాడుచుండెను. అదిచూచి యర్జునుఁ "డన్నా! యీచెట్టు నెవరుఁజేరరారు. పగలె చీఁకటిఁజూడ భయమగుచున్నది. మనయాయుధములిందు దాఁచిరానెద" మనెను. అందఱు నటులఁజేయ సమ్మతించి తమతమ యాయుధములఁదీసి కట్టకట్టి, యాసమీపముననె పడియున్న యొకచచ్చిన యెద్దును జూచి, దానిచర్మమొలిచి యాయుధములకుఁజుట్టి, దానినెవ్వరుఁ జేరకుండునటుల శవాకారముగఁజేసి కొమ్మలలోనడుమ వ్రేలఁగట్టిరి. దీని నింకను భీకర మొనరింపఁదలఁచి యాకట్టపై నొక జీర్ణశవమునుఁగూడ నంటఁగట్టిరి. అంతధర్మరాజు చెట్టునకుఁ బ్రదక్షిణము చేసి తమయజ్ఞాతవాసము నిర్విఘ్నమొనరింపుమని ధర్మదేవతకు నమస్కరించెను. ధర్మదేవతయు నాతని విన్నపమాలకించి ప్రత్యక్షముగ నభయమిచ్చెను.

నాఁడు విరాటరాజు మందిరబహిరంగణమునఁ గొలువుండెను. యుధిష్ఠిరుఁ డవసీనుఁ వేషమున నచ్చటకువచ్చి, "రాజా! నేను సకలధర్మశాస్త్రములుఁ జదివిన బ్రాహ్మణుఁడను. నీయొద్దనుండవలయునని వచ్చితి" ననెను. విరాటనృపాలుఁ డాతని మృదుకీర్తిఁజూచి యాదరముకలుగ 'నటులెయుండు'మనెను. ఇఁకఁ గొంతసేపటికి భీముఁడొక పెద్దగరిటె భుజమునఁ

బెట్టుకొనివచ్చి "రాజా! నేను బాగుగ వంటచేయఁగలను. నన్ను మీ సేవకులలోఁ జేర్చుకొనుఁడని" యడిగెను. విరాటుఁడతని మహాకృతిఁజూచి ప్రీతహృదయుఁడై వానినిఁ దనవంటయింటఁ బనిఁగొననియమించెను. తర్వాత నొకముహూర్తమున నర్జునుఁడాసభకువచ్చెను. ఆతని సుందరరూపముఁజూచి యిట్టివాఁడు నపుంసకుఁడయ్యెనని యచ్చటి వారందఱు దుఃఖించిరి. ఆతఁడు రాజుముందఱకుఁబోయి నిల్చి, "దేవా! నేను బాలికల కాటపాటలునేర్పఁగలను. నన్నుబృహన్నలయందురు. మీ కొమార్తెలకు నాచేఁజదువు చెప్పించెదరేని వారిని నృత్యగీతములందు గంధర్వులతో సమానలఁజేసెద" ననెను. విరటునకుత్తర యను నొకకూఁతురు కలదు. దానికిఁ జదువు చెప్పింపవలయునని యాతఁడు తలపోయుచుండెను. కావున నర్జును నాతఁడంతఃపురమున నుండనాజ్ఞాపించెను. పిమ్మట నకులసహదేవులునువచ్చి విరటునొద్దఁ జేరిరి.

ద్రౌపది మలినవస్త్రముల ధరించి హీనకులసంజాతవలెఁ బట్టణములోనికివచ్చి, రాజాంతఃపురమార్గమునఁబోవుచుండెను. ఆజీర్ణపరిధానములందైన నామె సౌందర్యము మఱుఁగుపడక ప్రకాశించుచుండెను. పనిపాటులులేని కొందఱామెవెనుకఁ జప్పటులుచఱచుచు నఱచుచువచ్చిరి. ఆయల్లరిఁజూచి విరాటుని రాణి తనదాసింబంపి ద్రోవదినిఁ దనదగ్గఱకుఁ బిలిపించెను. అంతద్రౌపది "దేవీ! నేను సైరంధ్రినైయుండ

వలసె. నా పేరు మాలిని. ఈనగరమున నెచ్చటనైనఁ గొలువు కుదురునేమోయని వచ్చినాను. నీకు దాసియక్కఱలేదా"యనెను. అంత సుధేష్ణనవ్వుచు "నింతయందముగ నున్నదాని నెవ్వరు చేరనిచ్చెదరు? మగవారందమైనయీయఁడుదాని నుపేక్ష చేయలే"రనెను. అంతద్రౌపది "తల్లీ! నన్నైదుగురు గంధర్వులు పెండ్లిచేసికొనిరి. నన్నెవరైనఁ దాఁకిరేని వారైదుగురువచ్చి పరిమార్చెదరు. కావున నాజోలి కెవ్వరును రా"రనెను. సుధేష్ణయు సంతోషించి ద్రౌపదిఁ దనయింటనుంచుకొనెను.

సుధేష్ణ కుచితోపచారములు చేయుచు ద్రౌపది సురక్షితముగాఁ గాలముగడపుచుండెను. అజ్ఞాతవాసవత్సరము పూర్తికావచ్చెను. ఇఁకఁ బదునైదు దినములు మాత్రము మిగిలెను.

సుధేష్ణకు సింహబలుఁడను నొకతమ్ముఁడు కలఁడు. వాఁడింతవఱకు బరదేశములనుండెను. వాఁడింటికి వచ్చిన పిమ్మట నొకనాఁడక్కగారినిఁ జూడవచ్చినప్పుడా చేరువనున్న ద్రౌపది వాని కంటఁబడెను. ఆమె లావణ్యమున కాతని హృదయము కరఁగెను. సుధేష్ణ యవ్వలకుఁ బోయిన సమయముఁ జూచి వాఁడు తనకోరిక నామె కెఱింగించెను. ద్రౌపది రోషకషాయితలోచనయై వానికిఁ దొలఁగిచనెను.

సింహబలుఁడు క్షత్రియుఁడు కాఁడు. క్షత్రియతుల్యుఁడు. వానినిఁ గీచకుఁడందురు. కీచకుఁ డతిమోహమున మతిభ్రమిం

చి మారవికారము నాపుకొనలేక తన యక్కతోఁ జెప్పుకొని యెట్లైన సైరంధ్రిని దనయింటికిఁ బంపుమని వేఁడుకొనెను. సుధేష్ణకుఁ దమ్మునియందు మక్కువ యెక్కువ. వాఁ డేమడిగిన నిచ్చును. ఏమి చేయుమనినఁ జేయును.

సాయంకాలమామె ద్రౌపదిఁ బిలిచి కీచకునకు ఫలాహారమును మద్యముఁ గొనిపొమ్మని యాజ్ఞాపించెను. ద్రౌపది తన దేవితో, కీచకుఁడు తన కపకారము చేయఁ దలఁచియున్నాఁడని చెప్పుకొనెను. ఆ మాటలు విని సుధేష్ణ కీచకుఁడూరి వారితో నెట్లున్నను మనయంతఃపుర దాసీజనుల జోలికి రాఁడు. భయము లేదు పొమ్మనెను. ద్రౌపది మాఱాడలేక తనకపాయము రాకుండఁ గాపాడుమని సూర్యునిఁ బ్రార్థించెను. సూర్యభగవానుఁ డావిలాపము నాలకించి యామె సహాయకాలమున రక్షింప నొక రాక్షసునిఁ దోడిచ్చెను. ద్రౌపది ఫలాహారమును సురయుఁ దీసికొని కీచకునింటఁ జొచ్చెను. కీచకుఁ డామెనుజూచినంతనే లేచి చేపట్టఁబోయెను. రాక్షసుఁ డామెకు సాయము వచ్చెను అప్పుడామె విదలించుకొని సభామండపమునకుఁ బాఱిపోయెను. సింహబలుఁడును రాక్షసునిఁ గూలఁద్రోసి యామెను వెంబడించెను. రాక్షసుఁడును లేచి వెనుకకుఁ జనెను. ఆలో ద్రౌపది సభయందున్న విరాటునితోఁ దనకు జరిగిన పరాభవముఁ జెప్పుకొనెను. సింహబలుఁ డనిన విరాటునికి భయము. కావున నతఁ డీగోడవ యంతఃపురమున తేచినవి. మీలో

మీాకై సరిపఱచుకొనవలయునని నేను. - అంత సింహబలుఁడును వానివెంట రాక్షసుఁడును వచ్చిరి. వారిద్దఱు నొకరినొకరు తలపడి పోరుచున్న సమయమున ద్రౌపది పాఱిపోయెను.

అటులపాఱిపోయి యామెమెల్లఁగ భీము నొద్దకుఁ జని, "సింహబలుని జంపినఁగాని నేను నిలువలే" నని యేడ్చెను! అజ్ఞాతవాసమంతయు సమాప్తి కానున్న సమయమునఁ గీచకుని మూలముగాఁ గార్యము చెడునట్లుతోఁచెను. భీముఁడాలోచించి "నీకొకయుపాయము చెప్పెదను. కీచకుపొత్తునకు నీవనుమతించిన ట్లుల నటించి వానిని రేపురాత్రి నర్తనశాలకురమ్మనుము. నీ బదులు నేనచ్చటనుండి వానిని గడతేర్చెద" ననెను ద్రౌపదియు సంతోషించి తన నెలవునకుఁబోయెను.

మఱునాఁడు కీచకుఁడు సైరంధ్రినొకమాఱు కన్నులారఁజూడవలయునని యంతఃపురమునకు వచ్చెను. అప్పుడు ద్రౌపది మునిమునిసవ్వులు నవ్వుచుఁ దెలిచియుఁ దెలియనికన్నుల నల్లనఁ జూచుచు వానియందనురాగముకుదిరిన దానిలాగునఁ జూచెను. వాఁడదిచూచి "మాలినీ! నాయం దెప్పుడు దయచేసెదె" వనెను. ఆమెయు మెల్లన "సింహబలా! ఇంతతొందరచేసి ననెములుని రాత్రి నర్తనశాలకు రమ్మచ్చటఁ జెప్పెద" ననెను. కీచకుఁడు బహ్వానందము చెంది తనయింటికిఁబోయి యెప్పుడు చీకటిపడునా యని వేచియుండెను. ద్రౌపదియుఁ గీచకుఁడు నర్తనశాలకువచ్చునని భీమునితోఁ జెప్పెను.

సాయంకాలమైనతర్వాతఁ దనపనులన్నియుఁ జక్కఁబెట్టుకొని మెల్లఁగ మల్లయుద్ధావసర ప్రయత్నములు చేసికొని భీముఁడు నర్తనశాలలో నరుఁగుపైఁ బరుండెను. సింహబలుఁడు నర్ధరాత్రమున సర్వాభరణభూషితుఁడై, సువాసనలు గుప్పుగుప్పున నెగయ నర్తనాగారముఁ జొచ్చెను. ఆచీకటిలోఁ దడవికొనుచుఁ దిన్నగ భీముఁడున్న తిన్నెకువచ్చి, చేయిపెట్టి చూచి చేతికి శరీరముతగిలినంతనె సైరంధ్రివచ్చినదని మెచ్చి "ప్రియా! నన్ను నీకౌఁగిటఁ జేర్చు" మనెను. భీముఁడును "మంచిది రమ్ము నాకౌఁగిలిమహాత్మ్యము చూచెదవులే" యని దిగ్గనలేచి వానితోఁ బట్టుపట్టెను. సింహబలుఁడును గంధర్వుఁడు వచ్చెనని యూహించి వానిందాఁకెను. పై వారువచ్చిన నజ్ఞాతవాసము చెడునని భీముఁడు భయపడెను తనమర్యాదపోవునని సింహబలుఁడు భయపడెను. కావున వారిద్దఱు జప్పుడు కాకయుండునట్లు నిశ్శబ్దపద్ధతుల మల్లయుద్ధము చేసిరి. సింహబలుఁడలసి నేలకొఱిగెను. భీముఁడు వాని వీపువిఱచిచంపె చిత్రవధచేయనుత్సాహముపుట్టి కాళ్లునుఁ జేతులుఁ దలయు సంచిలోఁ గుక్కినట్లు కడుపులోనికిఁ బొడిచి వానినొక పెద్దముద్ద చేసెను.

పిమ్మట భీముఁడు ద్రౌపదినిఁ బిలిచి "నాకపకారముఁ దలఁచిన సింహబలుని నాగంధర్వులు చంపి" రని గృహరక్షకులకుఁ జెప్పుమనెను. అంత ద్రౌపదియు రక్షకులను బిలిచి

క. నాపతులగుగంధర్వుల
చేఁ బడిమృతిఁ బొందెవీఁడె సింహబలుండు,

పాపాత్మునిఁజూచుచుఁ చు,

ర్వ్యాపార ఫలంబు గాంచె నని పలుకుట యున్

అందఱు భయకంపితులై ముక్కునవ్రేలిడుకొని చూచుచుం డిరి. ద్రౌపది తన శయనాగారమునకుఁ బోయెను.

---

# పదిమూఁడవ ప్రకరణము.

---

అజ్ఞాతవాసావసానము

కీచకుని మరణవార్త దేశమందతిశీఘ్రముగ వ్యాపించెను. పరిసర దేశవాసులందఱు నిఁక దాము సురక్షితముగనుండవచ్చునని యానందించిరి. పురస్త్రీజనములు నాఁటనుండి వీథి మొగము జూడఁగలిగిరి.

కీచకుఁడుచచ్చెనని వినినంతనె దుర్యోధనుఁడు గంధర్వుఁడను మిషతో భీముఁడు విరాటనగరమున గలఁడని నిశ్చయించెను. ఇదిస్పష్టమైనచో నజ్ఞాతవాసభంగమగును. దానివలన ధార్తరాష్ట్రులకు నిరంతరప్రాభవమును, పాండవులకు సంతతవనవాసక్లేశమును గుదురును. కావున దుర్యోధనుఁడు తనయనుమానము భీష్మాదివృద్ధులకుఁజెప్పెను.

దుర్యోధను నాస్థానమున సుశర్మయను నొకసామంత నృపాలుఁడుగలఁడు. అతఁడు త్రిగర్త దేశమునకు రాజు. పూర్వమొకపర్యాయము విరాట సేనలాతని దేశముఁ గొల్లఁగొనెను.

ఆకోపముఁదీర్చికొన నిదిసమయమని తలఁచి యాతఁడు "రా-
జా! దుర్యోధనా! నేను సేనలతోఁబోయి దక్షిణవిరాటనగర
మునఁ గలపశుగణములఁబట్టుకొనెదను. మీరుత్తరభాగమునఁ
బట్టణము ముట్టడివేయుఁడు. పాండవులందుఁ గలరేనిఁ దప్పక వి
రాటునకు సాహాయ్యముఁ జేయవచ్చెదరు. అప్పుడు సమయభం
గముఁ దెలిపి మరల నరణ్యవాసము నజ్ఞాతవాసము చేయింప
వచ్చు" ననెను. భీష్మాదులు నది న్యాయమేయనిరి.

అంత భాద్రపదబహుళాష్టమినాఁడు దుర్యోధను నాజ్ఞా
ప్రకారము త్రిగర్తదేశాధీశ్వరుఁడు విరాటనగరము సమీపిం
చి దక్షిణభాగమున నున్న పశువులఁ బట్టుకొనెను. విరటుఁడది
విని సుశర్మమీఁదికిఁ బోయెను. యుధిష్ఠిరభీమనకులసహదే
వులును సైన్యముతోఁజనిరి. అప్పుడీ రెండుసేనలకు మహాసం
గ్రామమయ్యెను. సుశర్మ మహాకోపమునఁ బోరాటము సలు
పుచుఁ జివరకు విరటుని విరథుఁజేసిపట్టి తనరథమునఁ బెట్టు
కొని పోవుచుండెను. భీముఁడది చూచి సుశర్మపైకురికి వాని
గుఱ్ఱములఁ జంపెను. ధర్మరాజు సారథిని నఱకెను. ఇది సమ
యముగ విరటుఁడు సుశర్మరథముపైనున్న గదఁగొని సుశర్మం
గొట్టెను భీముఁడాతనికి సాయమువచ్చి సుశర్మం గాళ్లుఁ జేతులు
గట్టి ధర్మరాజువద్దకుఁ గొనివచ్చెను. సేనానాయకుఁడిట్లు
శత్రువులచేతఁ బడినంతనె త్రిగర్తసేనలు పలాయించలయ్యెను.
విరటుఁడు ధర్మరాజుపరాక్రమముఁ బొగడి యాతనికిఁ దనరాజ్య

పెచ్చెదననెను కాని యాతఁడు వినయముతో “రాజా! నీవు మమ్ముఁ బోషించుచున్నావు. నీకై మా దేహములైన నీయవలయు నైన నీకొఱకర్పించెదను. ఈసుశర్మను వదలిపెట్టు” మనెను ధర్మరాజుమాటలువిని విరాటుఁడు సుశర్మను వదలిపొమ్మనెను.

విరటుఁడు సైన్యములఁ బురదక్షిణఖండమున నిటులు యుద్ధమునఁ బ్రవర్తించుచుండ నటు మఱునాఁడు దుర్యోధనుఁ డపారసేనాసమేతుఁడై వచ్చి యుత్తరగోసమూహములఁ బట్టెను. పట్టణమున నావార్త తెలియునప్పటికి దుర్గమున నెవ్వరును లేరు. విరటుని కుమారుఁ డుత్తరుఁ డొక్కఁడే యుండెను. వాఁడైనం జిన్నవాఁడు. ఇదివఱకెన్నఁడు యుద్ధమన నెట్టిదో యెఱుఁగఁడు. వాఁడంతఃపురకాంతల చెంత “నాకు రథముతోలుట కెవరైన నున్నచోఁ గౌరవసేనల నవలీలగెలిచి పశువులవిడిపించి తెచ్చెద” ననెను. ద్రౌపది యామాటలువిని “యుత్తరా! మన బృహన్నల రథము తోలఁగలఁడు పూర్వము ఖాండవదహనావసరమున నర్జునున కీతఁడే రథముతోలెను. ఆతనిఁ బిలిపింపు” మనెను.

ఉత్తరుఁ డర్జునుఁ బిలిపించి “బృహన్నలా! మేము కౌరవసేనతో యుద్ధమునకుఁ బోవలెను. నీవుపూర్వమర్జునునకు ఖాండవదహనావసరమున రథముతోలితివని సైరంధ్రి చెప్పినది. నీవు మాఱుమాటాడక రావలయు” ననెను. అర్జునుఁడును గొంతతడవు హాస్యకారణమగు నటులనటించి, యుత్తరునితోఁ బోవన

ప్పఁతించెను. అదియుఁగాక కడచిన నాఁటితో నజ్ఞాతవాస సంవత్సరముఁ బూర్తియయ్యెను.

అర్జునుఁడు రథమునడప నుత్తరుఁడు కౌరవసేనలున్న దిక్కునకుబయలు దేరెను. పురబాహ్యమునశమీసమీపమునకు వచ్చునప్పటికి శత్రుసేనలన్నియు బాగుగఁగానిపించెను. ఉత్తరుఁ డు కాభీష్మాదికురువీరులఁజూడ నొడలు గడగడ వడఁకెను. చలిచెమట పెట్టెను. వాఁడు భయమున వణఁకుచు ,,బృహన్నలా! నేను తెలియకవచ్చితిని. ఈమహాశూరుల నే నొక్కఁడ నెదిరింపలేను. ఇంటికిఁబోదము రమ్ము'' మనెను. అర్జునుఁడాబాలునిమాటలు సరకుఁగొనక ముందునకుఁ దోలుచుండెను. అంత నుత్తరుఁడు రథముదిగి పాఱఁజొచ్చెను. అర్జునుఁడును వానిని వెంబడించిపట్టుకొని యదలించి తిరుగ రథమునెక్కించి ,,నీవు యుద్ధముచేయకున్న నేను చేసెదను. నీవు రథము తోలు'' మనెను. ఈపాత్రముంగని కౌరవసేన లమందముగ నవ్విరి.

ఇట్టులు త్తరకుమారుని రథమెక్కించి శమీసమీపము నకువచ్చి వానికిఁ జెట్టునశవాకృతినున్న యాయుధములఁజూఁపి ,,కుమారా! పాండవులు తమయాయుధములిచ్చటఁ బెట్టినారు. చెట్టెక్కి యాకట్టఁ దెమ్ము''ని చూపెను. ఉత్తరుఁడాశ్చర్యము చెంది ,,బృహన్నలా! యాయుధములిచ్చటఁబెట్టి వారెక్కడి కుఁజనిరి''? యని యడిగెను. అంత నర్జునుఁడు ,,కంకుఁడు

ధర్మరాజు; వలలుఁడు భీముఁడు; నకులుఁడు దామగ్రంథి; సహదేవుఁడు తంత్రీపాలుఁడు; నే నర్జునుఁడను; మాలిని ద్రౌపది. గంధర్వుఁడను పేర భీముఁడు కీచకునిఁ జంపినాఁడు. ఈరహస్యములు నాయనుమతి లేనిదె యెవరికిం జెప్పకు” మనెను. ఉత్తరుఁడును మహానందముతో “నిశ్చయముగాఁ గౌరవుల గెల్చినాము. సందేహము వదలి రథము నడపెద” నని గాండీవమును దానితూణీరములను దెచ్చి యర్జునున కిచ్చెను. అంత వారిద్దఱు రథమెక్కిరి. అర్జునుఁడొక మాఱు శమీవృక్షమునకుఁ బ్రదక్షిణముగ రథముఁ దోలించెను. అంతలో నాతని శిరమునఁ గిరీటము మొలచెను. శరీరమునఁ గవచము వచ్చెను. అమరదత్తమైన దేవదత్తము చేతిలో నమరెను. అప్పుడర్జునుఁడు “జయ! పరమేశ్వరా” యని దేవదత్తముఁ బూరించెను. ఆమహారావమున దిక్కులు పిక్కటిల్లెను. రథవారణములు మోకరించెను. ఉత్తరుఁడు మూర్ఛపడెను. కౌరవబలములు భీతిల్లెను. దుర్యోధనుఁ “డదుగో నర్జునుఁడు. సమయభంగమైన” దనెను. భీష్ముఁడు “కాదు. అజ్ఞాతవాసము నిన్నటితో ముగిసినది. చిరాయుమున నాగ్రహోదగ్రుఁడై యర్జునుఁడు వచ్చుచున్నాఁడు కాచికొనుఁ” డనెను. అశ్వత్థామ కర్ణుంజూచి “కర్ణా! యర్జును నేమో చేసెదనని బీరములాడుచుందువు. ఏమి చేసెదవో చూపు”మనెను.

దేవదత్తరవమున సకలసత్త్వములు దిగ్భ్రాంతములై యున్నంత గాండీవనిర్ముక్తకాండప్రకాండము లకాండధారా

ధరజలధారలఁబోలెఁ గౌరవసైన్యములఁగప్పెను. ఆసైన్యమంతయు రెండుపాయలయ్యెను. అర్జునుఁడు తనరథమడ్డముగఁ దోలి పశుపాలకులను విడిపించెను. వారు శీఘ్రముగఁ బశువులఁదోలుకొని పట్టణమునకుఁబోయిరి. అర్జునుబాణవర్షమునఁ గౌరవసేన కలఁగిపోవుచుండెను. కర్ణుఁడువచ్చి యర్జునునడ్డగింపఁజూచెను. వాని ముగమునను శరీరమునను నేకబాణములు నిండెను. ఆబాధనోర్వఁజాలక కర్ణుఁడు పాఱిపోయెను. ద్రోణాచార్యుఁడు మూర్ఛిల్లెను. భీష్మునిగుఱ్ఱములు నాశనమయ్యెను. సారథి చచ్చెను. ఆతనివిల్లుఁగూడ విఱిగెను. అంత నాతఁడు వెనుకకుంజూడక పఱవసాగెను. వీరందఱు నిటులుపోవుటఁ జూచి దుర్యోధనుఁడతిదైన్యమున "నాగతి యేమి? కొంచెము నిలువఁబడు" డని వారిం బ్రార్థించెను. అర్జునుఁ డతనియొద్దకువచ్చి 'దుర్యోధనా! యిది దొంగజూదమనుకొంటివా? పౌరుషము నిలుపు" మనెను. అర్జునుఁడు దుర్యోధనుని మీఁదికేవచ్చినాఁడని పాఱిపోవుచున్నవారందఱు నాతనికడ్డమువచ్చిరి. అర్జునుఁ డనేకబాణములు వారిలఁ జీకాకుపఱచి తుదకు సమ్మోహనాస్త్రము ప్రయోగించెను. దానిబలమున బలగమునందలి యేనుఁగులన్నియుఁ గునికిపాట్లుపడెను. గుఱ్ఱములు నిద్రపోవుచు నిల్వఁబడెను. యోధులాయుధములువదలి నిశ్చేష్టులైరి.

అంద ఱాగతి నిద్రావివశులై యున్నసమయమున నర్జునుఁడు దుర్యోధనాదికుమారుల వధింపననువుగానున్నను దయ

ము. బృహన్నల జయించెను బృహన్నలవిజయము గొనియాడు
ము'' మనెను. విరటుఁ డామాటలకుఁ గోపమురాఁగా ధర్మరాజుం బా
చికలతోఁ గొట్టెను. పాపమాతని ముఖమున రక్తమువచ్చునట్లు
గాయము పడెను. ఆసమీపమున నెయున్న ద్రౌపదివచ్చి రక్త
ము క్రిందపడకుండఁ దనచీరచెంగుతో నొత్తెను.

అంతలో ద్వారపాలకుఁ డుత్తర బృహన్నలలు వచ్చినా
రనిచెప్పెను. ధర్మరాజామాటలువిని బృహన్నల నావలనుంచి
యుత్తరునిలోనికిఁ బిలుచుకొనిరమ్మనిచెప్పెను. ఆతఁడు తనకుఁ
దగిలిన గాయముఁజూచిన ఙ్జనుఁడువిరటు నేమిచేయునోయని భ
యపడెను. ఉత్తరుఁడు లోనికివచ్చినంతనె విరటుఁడు వానిఁ
గౌఁగిలించికొని నాయనా! నావంశపావనమైనదిరా! నీ వొక్కఁ
డవట్లు కౌరవవీరుల జయించితివని యానందబాష్పముల బాల
కునిశిరము దడిపెను. అంత నుత్తరుఁడు "తండ్రీ! నేనేమియుఁ
జేయలేదు. పురబాహ్యమున నొకదివ్యపురుషుఁడు నాకుసాయ
మువచ్చి యవలీలఁ గౌరవులఁబాఱఁదోలినాఁ"డని యంతలో
ధర్మరాజునకుఁ దగిలినగాయముఁజూచి యులికిపడి "కంకున
కేలగాయము పడిన"దనియడిగెను' అంతవిరటుఁడు "నేను నీజ
యము ప్రకటించుచుండఁగ నీతఁడు నిన్నలఁతిగాఁబలికెను. నాకుఁ
గోపమువచ్చి సారెతోఁ గొట్టితి" ననెను. ఉత్తరుఁడాతనిపలుకు
విని "తండ్రీ బ్రాహ్మణుల నిట్లవమానించెదవా? క్షమిం
పవేఁడికొను" మనెను. విరటుఁడు పశ్చాత్తాపముఁ జెంది తన్ను
క్షమింప యుధిష్ఠిరుని బ్రతిమాలెను.

మఱునాఁడు పాండవులందఱుఁ దమతమ నిజరూపము లతో విరటునికన్న ముందఱ సభకువచ్చిరి. ధర్మరాజు విర టుని సింహాసమున గూర్చుండెను. తమ్ము లుచితాసనముల నుండిరి. కొంతసేపటికి విరటుఁడచ్చటకువచ్చి విస్మరముగ సిం హాసనమున నున్న ధర్మరాజుం జూచి నవ్వుచు, "కంకుభట్టు! నీకు మతిచెడినాయేమి? నాసింహాసనమునఁ గూర్చుండి నేను వచ్చిన తర్వాతనైన లేవవేమి"? యనెను. అంతనర్జునుఁడు.

ఉ. ఈతఁ డజాతశత్రుఁడు మహిం దగ దిగ్విజయంబుసేసె వి
ద్యాతిశయార్థి వాసవు మహాసనమైనను నెక్కనర్హుఁ డు
ద్ధ్యోతితమూర్తి కౌరవకులోద్వహుఁ డార్యనికాయసంతత
ఖ్యాతచరిత్రుఁ డీచిఱుతగద్దియకుం దగఁడే నరేశ్వరా?

యనెను విరటుఁడు నిశ్చేష్టుఁడయ్యెను. మెల్లగఁ జెప్పి తెల్లి "యీతఁ డజాతశత్రుఁడైన నీతనితమ్ములును ద్రౌపదియు నెచ్చటనున్నా" రనెను. అంత నందఱు నాతనిముందఱ నిల చిరి. వారినిఁజూచి విరటుఁడు, "మీవృత్తాంత మిదివఱకెఱిఁగిన మీకు నారాజ్యమంతయునైన నీయనా? తానుస్వయముగ నృత్యగీతములుచెప్పి విద్యగఱపిన యుత్తర నర్జునునకిచ్చి వివా హము చేసెదను. మీరు సమ్మతింపవలయు" ననెను. అర్జునుఁ డాతని వారించి, "విద్యాబుద్ధులు చెప్పితిని కాన నది నాకుఁ గుమారివంటిది. మా యభిమన్యునకు నీయఁదగు" నని చె ప్పెను. విరటుఁడును సంతోషించెను.

వెంటనే, యభిమన్యుని సుభద్రను, దీసికొనిరమ్మనియు నభిమన్యునకు నుత్తరనిచ్చెదరని శ్రీకృష్ణబలరాములకుఁ దెలియఁ జేసిరి. మఱియు నానామిత్రధాత్రీపతులకు వివాహాహ్వానపత్రిక లంపిరి. అంత నొకశుభముహూర్తమునఁ బాండవులుశమీవృక్షమునొద్దకుఁబోయి, ధర్మదేవతనుఁబూజించి, తమయాయుధములఁ దెచ్చుకొనిరి. శ్రీకృష్ణబలరామాది యాదవులు సుభద్రను నభిమన్యుని వెంటఁబెట్టుకొనివచ్చిరి. పాండవులును బెండ్లికి వారిపక్షమున వచ్చినబంధువులు నుపప్లావ్యనగరమున విడిదిచేసిరి. విరటుఁడు వారికిఁ గావలసిన భోజనగంధమాల్యాద్యుపచారములు నడపుచుండ వారచ్చట సుఖముగనుండిరి. అంత నొక సుముహూర్తమున నభిమన్యువివాహమహోత్సవము గావించిరి.

---

# పదునాల్గవప్రకరణము.

---

## సంధిప్రయత్నములు.

అభిమన్యువివాహమునకుఁ బరిసరదేశాధీశులందఱు వచ్చిరి. వీరందఱుఁ బాండవుల ధర్మప్రవర్తనముఁ బ్రకటించి వారికి వీరియందభిమానముఁ గలిగించుట మంచిదని శ్రీకృష్ణబలరాములు తలఁచిరి. జూదమునాఁ డొప్పుకొనినటులఁ బదుమూఁడేండ్లరణ్యవాసము చేసి తర్వాత నొకయే డజ్ఞాతవాసము చేసి ధర్మరాజు తనప్రతిజ్ఞ నెఱవేర్చికొనెను. అయినను దు

ర్యోధనుఁ డాహ్వానము చేయక వీరి రాజ్యము వీరికిచ్చునా? రాజులందఱునున్న సభయందీవిషయములను, బలరామాదులు చర్చించిరి. ఆసందర్భమున బలరాముఁడు కార్యసాధనమునకు దండము ధర్మోపాయమనియుపన్యసించి, ముందు సంధిప్రయత్నము చేయుట న్యాయమని చెప్పెను. శ్రీకృష్ణుఁడును సమ్మతించెను. రాజులందఱు సన్ధిసమకూడనిచోఁ బాండవులకు సాహాయ్యము చేసెదమనిరి. అంత ద్రుపదుఁడు మధురవచన రచనాధురీణుండైన తనపురోహితుని ధృతరాష్ట్రుపాలికిఁబంపి "పాండవులు మాట చెల్లించిరి కావున నికధృతరాష్ట్రుఁడు వారిరాజ్యము వారికీయవలయునని చెప్పు"మనెను.

ఆబ్రాహ్మణుఁడు హస్తినాపురమునకుఁబోయెను. ధృతరాష్ట్రుఁడు వానినెంతయు నాదరించెను. భీష్మద్రోణకృపాశ్వత్థామ కర్ణశకునిదుర్యోధనాదులసమక్షమున నాతఁడు "పాండవులు తమప్రతిజ్ఞఁ జెల్లించిరి కావున వారిరాజ్యము వారికీయవలయు"నని చెప్పెను. దుర్యోధనుఁడు సూదిమోపఁదగినంత నేలమైన నీయననెను. కర్ణుఁడు "నేనుండఁగఁ బాండవులను నీవు జయించుట కేమిసంశయమని హెచ్చరించెను. భీష్ముఁడప్పుడు లేచి "కర్ణా! నీమన్మంత్రమునఁ గౌరవవంశము నశించుచున్నది. నీవు పెద్దమాటలు చెప్పి సమయమువచ్చినప్పుడు పాఱిపోదువు. గంధర్వయుద్ధము జ్ఞాపకముచేసికొ"మ్మనెను. అంతఁ గర్ణునకుఁ గోపమువచ్చి భీష్ముఁడుబ్రతికియున్నంతవఱకు నేనాయుధములు ముట్టనని సభనుండి లేచిపోయెను. దుర్యోధనాదికుమారులు

నాతని వెనుకఁ జనిరి. సభ కలకలాకులమయ్యెను. ధృతరాష్ట్రుఁ డీ సభాసమంతయుఁ జూచి, శ్రీకృష్ణునితో "అయ్యా! నేను దుర్భాష నా యాగ్రహముఁ జెప్పెను. ప్రస్తుతము మీరు పాండవులకుఁ జనుఁడు'' అనెను. పిమ్మట ధృతరాష్ట్రుఁడు సంజయుని పాండవుల కడకుఁ బంపెను. అతఁడు సామాన్యముగ, వనవాసక్లేశమునకు నజ్ఞాతవాసాసిధారావ్రతమునకును పాండవులను బాగుగ నోదార్చి పోయెనంతే కాని, రాజ్యము మాటఁదలపెట్టఁడయ్యెను.

అయినను ధర్మరాజునకు యుద్ధమునం దిష్టము లేదు. ధార్తరాష్ట్రులు నూర్గురుఁ బాండవులైదుగురుఁ గలసి నూటయైదుగు రన్నదమ్ములై సుఖముగనుండుటయే యతనికభిమతము. చివరకైదూళ్లయిన నిచ్చిన సంతుష్టిపడుదునని యాతఁడనెను. శ్రీకృష్ణుఁ డీరాయబారము నడపఁబూనెను. అతఁడాకార్తిక మాసమున హస్తినాపురమునకుఁబోయి ధృతరాష్ట్రునకుఁ దన వార్త నెఱిఁగించెను. భీష్మాదులందఱు ధర్మరాజెంతయు ధర్మాత్ముఁడని పొగడిరి. భూమండలమంతయు జయింపఁగలిగిన సోదరులుండియు నతఁడింత స్వల్పముగ నడుగుచున్నపుడు త్రోసివేయఁగూడదనిరి. దుర్యోధనుఁడు మాత్ర మొప్పుటవలెనె "ఐదూళ్లుగాదు. ఒకటైన నీయను. సూదిమోపుటకైనఁ దావీయ'' ననెను.

నాఁడు శ్రీకృష్ణుఁడు విదురునింట భోజనము చేసెను. మఱునాఁడాతఁడు మరలసభకువచ్చినప్పుడు దుర్యోధనుఁడాతనిఁ జెఱపట్టవలయునని తన స్నేహితులతో నాలోచించుకొనెను.

ఈలోఁ నాఁటిసభయందు నడచినవృత్తాంతమంతయు విని వ్యాసుఁడచ్చటికువచ్చెను. ఆమునిసత్తముఁడు గాంధారి దగ్గఱకుఁబోయి "తల్లీ! నీవైనఁ గుమారుని మందలింపుము. ధృతరాష్ట్రా! నీవుపేక్ష చేసిన నేమనుకొనుచున్నావు? కుల నాశనమగుఁజుమీ! యనెను. ధృతరాష్ట్రుఁడాతనివైపునకుఁ దిరిగి, "మునివర్యా! నేనధముఁడను; కుమారులను శిక్షింప లేను కార్యమావశము తప్పినది. ఇఁక నామాటలువినఁడు"మనెను. గాంధారి "మునిశ్రేష్ఠా! మీరుండఁగ వానినిఁ బిలిపింతు జూడుఁడ"ని దుర్యోధనునిఁబిలిచి "నాయనా! నామాటవిను. పాండవులు దేవసహాయముగలరు వారితో సంధిచేసి కుల నాశనము తప్పింపు"మనెను. దుర్యోధనుఁడు సమాధానముఁ జెప్పక, నిలువునిలుచుండి తలిదండ్రులకైన నమస్కరింపక, మునినాథునినైనఁ జూడక గిఱుక్కున మఱలెను.

మఱునాఁడు మరల సభయయ్యెను. అందఱువచ్చిరి, దుర్యోధనుఁడు తనస్నేహితులతో శ్రీకృష్ణునిఁ జెఱపట్ట సిద్ధముగవచ్చెను. శ్రీకృష్ణుఁడది కనిపెట్టి "మూర్ఖా! దుర్యోధనా! నేనొంటరిగా వచ్చితిని కదా యని నన్నుఁ బట్టుకొనఁ జూచుచున్నావా? ఇదిగోఁ గన్నులఁదెఱచి చూడు"మనెను. అంతలో నాతనిపార్శ్వమునఁబాండవులు కనఁబడిరి. అతనిశరీరమున బ్రహ్మమహేశ్వరాది దేవతలును, పరమమునులును,గానిపించిరి. ధృతరాష్ట్రునకును దివ్యదృష్టివచ్చి యావిశ్వరూపము

జూచి "కృష్ణా ! దేవా ! నాకుమారులు లల్పజ్ఞులు తెలియక నీకవమానము చేయదలచిరి. శాంతింపుము శాంతింపు"మని నమస్కరించెను. శ్రీకృష్ణుడప్పుడు తననిజరూపముదాల్చి సభామందిరమును విడలి తనత్రోవ నేగను.

తిన్నగ నాతడు విదురునింటికిబోయి నాటి సభావృత్తాంతమంతయు గుంతికిజెప్పెను. కుంతి "యన్నా! పాండవులనికవచ్చి తమ క్షత్రియజన్మము సార్థకముచేసి కొనువను" మనిచెప్పెను. ఆతడామెను వీడ్కొని గమనోన్ముఖుడయ్యెను. శస్త్రసన్యాసముచేసి యిటనున్న కర్ణుడాతని గొంత సాగనంపెను. శ్రీకృష్ణుడు వాడు కుంతికుమారుడగుటజెప్పి పాండవులతో జేరుమనెను. కర్ణుడామాటవిని "యింత కాలము నన్ను దుర్యోధనుడు పోషించెను. ఆపత్సమయమున నతనివిడుచుట ధర్మముకాదు. నన్నునమ్మి యతడాహవోన్ముఖుడయ్యెను పాండవులను గెల్చుట కిష్టమని నేనెఱుగుదు"ననెను. శ్రీకృష్ణుడు వాని ధర్మబుద్ధికిమెచ్చి "కర్ణా! నేను బోయివచ్చెదను. మహాకలియుగము వచ్చుచున్నది. ఈసమయమునజచ్చిన వారిది పుణ్యమని భీష్మాదులకుజెప్పు"మని వానిం బంపి తా నుపప్లావ్యమునకు వచ్చెను.

---

# పదునయిదవప్రకరణము.

## ౧. హాస్యగ్రామము.

శ్రీకృష్ణుఁ డుపప్లావ్యమునకు వచ్చి సంధిపొసఁగు నాశ లేదని చెప్పెను. ధర్మరాజును యుద్ధముచేసెదననెను. భీమార్జునులు తమ బాహుబలములకుఁ దుష్టియగునని సంతోషించిరి. అర్జునుఁ డుత్సాహమున నాబాణములచేఁ గౌరవబలమంతయు నొక దినములో నాశనముఁ జేసెదననెను. భీముఁ డర్జునా! నన్నుఁ గూడఁ గొంచెము చూడుము, దుర్యోధనదుశ్శాసనులను మాత్రము నాకు వదలుమనెను.

విరాటుఁడు తన సేనలన్నిటిని పాండవులకిచ్చెను. ద్రోణాచార్యునిఁ జంపుటకు జనించిన ధృష్టద్యుమ్నుఁ డొకఁడ్కోఁడని ద్రుపదుఁడువచ్చెను. యాదవబలములతో సాత్యకి వచ్చెను. శ్రీకృష్ణుఁడరు దెంచి, యర్జునునకు రథముఁ దోలెదననెను. తక్కిన రాజులు కొందఱు పాండవులను గొందఱు కౌరవులను జేరిరి. కౌరవులకు బదునొకండక్షౌహిణులును బాండవులకేడును సమకూడెను. పాండవసేన ధృష్టద్యుమ్నుని సేనాధిపతిఁ జేసికొనిరి. కౌరవులు భీష్ముని పెద్దఁ జేసిరి.

ఉభయసైన్యములు హస్తినాపురసమీపమున నున్న కురుక్షేత్రమునందుఁ జేరి యుద్ధమారంభించిరి. ఆభీకరసంగ్రామమున దినమునకెందఱో చనిపోయిరి. ఒక్కొక్కప్పుడు కా

రవులై యోడిపోవునటులుండెను. ఒకమారు పాండవులు నిరాశ చెందుచుండిరి. కౌరవసేనయందు భీష్మద్రోణకర్ణశల్యులున్నంతవఱకుఁ బాండవులకు జయముకలుగదని నిశ్చయమయ్యెను. అందును భీష్ముని ముందట నెవ్వరు నిలువలేకుండిరి. అర్జునుఁడును వెల్లఁబోయెను. ఈవిధముగ నొకనాఁటితరువాత నొకనాఁడు భీష్ముఁడరిసంఘములఁ దునుమాడఁగఁ దొమ్మిదిదినములు గడచెను.

భీష్మున కొకవ్రతముగలదు. యాఁడుదానితోడను, నపుంసకునితోడను, జననకాలమునఁ గాక నడుమ మగతనము వచ్చినవానితోడ నాతఁడు యుద్ధము చేయఁడు. పాండవులిది తెలిసికొనిరి.

పాండవసేనయందు శిఖండియను నొకరాజకలఁడు. వాఁడు తొలుత నాఁడుపుట్టువునఁబుట్టి యీశ్వరానుగ్రహమున మగవాఁడయ్యెనందురు. పదియవనాఁడర్జునుఁడాతనిఁ దనముందఱఁబెట్టికొని భీష్మునెదిరించెను. భీష్ముఁడు తన వ్రతభంగముకలుగునని శిఖండిఁ గొట్టుట మానెను. అర్జునుఁడు శిఖండివెనుకనుండి బాణములవారిగఁ దాతపైఁ గురిపించెను. భీష్మునిశరీరమునందు వ్రేలెడైనను లేకుండ బాణములు గ్రుచ్చుకొనెను. సాయంసమయమునకు భీష్ముఁడలసి నేల కొరిగెను. ఆతని నిండనున్న బాణములు పఱుపవలెనుండ నాతఁడుండెను. భీష్ముఁడు పడినంతనె కౌరవబలములన్నియుఁ బాఱఁబోచ్చెను.

అర్జునుఁడు పితామహుఁడు పడెనని విచారమునఁ బాఱిపోవు వారిని దఱుముటయు మఱచి నిశ్చేష్టుఁడై నిలఁబడెను.

రాజులందఱు నతని చుట్టుఁ జేరిరి. దుర్యోధనాదికుమారులును బాండవులు నతనిదగ్గఱకుఁ బోయిరి. అతఁడందఱను దగురీతి నుపచరించెను. కన్నీరు విడిచెను. తెల్లఁదెల్లఁబోవుచున్న యర్జునుఁ జూచి "నాయనా! నీవుక్షత్రియధర్మము నెరవేర్చితివి, విచారింపవల దనెను. అప్పుడు దక్షిణాయనము. కార్తికమాసము గావచ్చును.

గంగాదేవి తనకుమారుఁడు దక్షిణాయనమునఁ జనిపోవునేమో యని సందేహించి హిమవత్పర్వతనివాసులగు గొందఱమునులను భీష్మునియొద్దకుఁ బోయి యాతని నుత్తరాయణమువచ్చు వఱకు నిలువుమని చెప్ప బ్రతిమాలుకొనెను. మునులును మానసౌకస్వరూపధారులై వచ్చి యాకాశమున శారదాభ్రబృందములవలె సంచరించుచు మృదుస్వరముల "భీష్మా! కురుశ్రేష్ఠా! ఇది దక్షిణాయనము. ప్రాణములు విడువకు"మనిరి. భీష్ముఁడును "మానసౌకములారా! నేనెఱుఁగుదును. ఉత్తరాయణము వచ్చిన గాని ప్రాణములను విడువ"ననెను. హంసములును దిరోధానము నొందెను.

అటులఁ బడియున్న భీష్ముని రాత్రులయందుఁ గ్రూరజంతువులు బాధింపకుండు నట్లొక యావరణము చేసి, తగువారలఁ గావలియుంచిరి. భీష్ముశరీరము నేలనంటక యున్నందున

నతనితల క్రిందికిఁ వ్రేలుచుండెను. ఆతఁడు తనకొక తలగడ తెమ్మని దుర్యోధనునడిగెను. దుర్యోధనుఁడు చక్కని తూలికామయోపధాన మొకటిఁ దెప్పించెను. భీష్ముఁడదిచూచినవ్వి “యర్జునా! నీవుగాని యొకఁడు తగిన తలగడపెట్టవే”డనెను. అప్పుడర్జునుఁడు మూఁడుబాణములు తాతతలక్రిందవైచి వాని మడిమలు శరతల్పముతో సమానముగనుండునట్లు నాటించెను భీష్ముఁడు తనతల దానిపై నాపికొనెను కొంతసేపటికి తనికి దాహమయ్యెను ఆతఁడు “శరతల్పముననున్న నాకు శరసంభూతములుగాని నీళ్లు త్రావరా”దనెను. దుర్యోధనాదులేమిచేయ వలయునో తెలియఁజాలక నిలుచుండిరి అర్జునుఁడొక బాణము సంధించి భూమిలోనికిఁ గొట్టెను భూవివరమునుండి, తళతళలాడుచుఁ బాతాళధారబయలుదేరెను భీష్ముఁ డానీటిఁ ద్రావి దాహముఁ దీర్చుకొనెను. ఆతనికి వలయు నుపచారము లొనరింపఁదగు వారి నియోగించి కౌరవులును పాండవులుఁ దమతమ శిబిరములకేగిరి.

భీష్మునసంతరము ద్రోణుఁడు సేనాధిపతియయ్యెను. కర్ణుఁడును వచ్చెను. ద్రోణుడు సైన్యాధికారాభిషేకసమయమున దుర్యోధను నొకవరము కోరుమనెను. దుర్యోధనుఁడు “బ్రాహ్మణోత్తమా! యుధిష్ఠిరుని బంధించి తె”మ్మనెను ద్రోణుఁడు వాని హృదయమెఱుఁగదలఁచి “యతని నేమిచేసెద”నని యడిగెను. దుర్యోధనుఁడు “యుధిష్ఠిరునిఁ జంపినఁ బాం

డవులు మనల బ్రతుకనీయరు. వానినిగట్టి తెచ్చి మరల జూద మాడించి శాశ్వతవనవాసమునకుఁ బంపిన మేలగు'' ననెను.

ద్రోణుఁడు ధర్మరాజుం జెఱపట్టెదనని ప్రతిజ్ఞ చేసెను. దుర్యోధనుఁడామాట శిబిరమందుఁ జాటించెను. పాండవులు నది వినిరి. అర్జునుఁడు "నాప్రాణములుండగ ధర్మజు నెవ్వరుఁ బట్టలేరని ప్రతిజ్ఞ చేనెను. అర్జును పూనికవిని కౌరవబలమునం దుఁ బదివేవురు రాజకుమారు లర్జునుఁ జంపనైనఁ జావెదము. చావనైనఁ జచ్చెదమని శపథము పట్టిరి.

ఈవిధముగ, బ్రతిజ్ఞపైఁ బ్రతిజ్ఞ చేసి ప్రాణములపై నాస్థవదలి యుద్ధము చేయుచుండఁ బోరు ఘోరముగనుండెను. అర్జునునికుమారుఁ డగునభిమన్యుఁడు మృతినొందెను. ఎంద ఱోరాజులువచ్చిరి. ద్రోణుని దప్పించుకొనుటయె కష్టముగ నుండెను. ఇఁక జయించుటెట్లు? .

శ్రీకృష్ణుఁ డర్జుననిఁజూచి "యాచార్యుని జయింపఁద రముకాదు. ఏదైన దుఃఖవార్తవినిన నాతఁడు పోరువదలును అశ్వత్థామ చచ్చెనను'' మనెను. అర్జునుఁ డసత్యమాడననెను. ఆసమయమునవె మాళవరాజు నేనుఁగొకటిచచ్చెను. దానిపే రశ్వత్థామ. భీముఁ డానెపమున నశ్వత్థామ చచ్చెనని గట్టిగన ఱచెను. ద్రోణుఁడదివినెను. ఆతనిహృదయము పగిలెను. అయినను యుద్ధము చేయుచు నొకభటుని యుధిష్ఠిరుదగ్గఱకుఁ బోయి నిజము దెలిసికొని రమ్మనిపంపెను. శ్రీకృష్ణుఁడును

యుధిష్ఠిరునొద్దకుఁ బోయి మాళవాధీశు సేనఁగు చచ్చుటయు దాని పేరశ్వత్థామ యగుటయుఁ జెప్పి యశ్వత్థామ చచ్చెనను ననెను. ధర్మరాజప్పు డశ్వత్థామ చచ్చెననెను.

ద్రోణుఁడా మాటవిని శస్త్రములనవిడి రథముపైఁ గూర్చుండి ప్రాణములు వదలఁదలఁచి ప్రాణాయామముఁ బట్టెను. ప్రాణములు వదలుచున్న సమయమున ధృష్టద్యుమ్నుఁడు వచ్చి యాతని నీడ్చి తలనఱికెను. ద్రోణుఁడు చచ్చినతోడనె కౌరవ వ్యూహము చెదరి పాఱిపోయెను.

ద్రోణుని మరణానంతరమున కర్ణుఁడు సైన్యాధిపతి యయ్యెను. కర్ణుఁడు పరాక్రమశాలియైనను వానికెన్నియో శాపములుగలవు. బ్రాహ్మణుఁడ నని చెప్పి యసత్యముగ నస్త్రము లభ్యసించినందులకుఁ దనయస్త్రము లవసరమునకు స్ఫురింపకుండునట్లు పరశురాముఁడు శపించెను. బాణవ్యాసంగము చేయుచున్నపుడొక బ్రాహ్మణుని ధేనువున కొకబాణముతగి యది చచ్చినందున నాతఁడు కోపించి మహాయుద్ధమున రథము నేలలో దిగఁబడునట్లుల శపించెను. అన్నిటికిఁ దోడాతనికి రథమునడపుచున్న శల్యుఁడు నిరంతరమర్జునుం బాండవుల బొగడుచు వానికి నిరుత్సాహముఁ గలిగించుచుండెను.

ఇన్నియవరోధములున్నను, గర్ణుఁ డెచ్చటకుఁ బోయిన నచ్చటఁ భీముఁగుఁ బెంటలు కుప్పతిప్పలయ్యెను. అర్జునుఁడెన్ని మాఱులో వాని బారినుండెను గాని కర్ణునికి నమయస్ఫూర్తి

నశించెను. వారిద్దఱు నొకరికొకరు తీసిపోవక పోరుచున్నసమయమునఁ గర్ణుని రథచక్రములు నేలలోదిగఁబడెను. కర్ణుఁడు రథముదిగి "యర్జునా! నారథచక్రము క్రుంగిపోయినది. నేను దీనినెత్తువఱకు బాణములు నాపుము. ఇది ధర్మయుద్ధపద్ధతి గనుక నడిగితిని కాని నీకు భయపడికా"దనెను. ఆమాటల కర్జునుఁడు మెత్తపడునేమోయని శ్రీకృష్ణుఁడు "కర్ణా! నీవును ధర్మము చేరెత్తెదవా? ద్రౌపదిని వివస్త్రం జేయ వచ్చునంటివి. ఘోషయాత్ర నెపమునఁ బాండవుల హింసింప దుర్యోధనునిఁ బురికొల్పితివి. అప్పుడీనీతులేమైన"వనెను. అర్జునునకాసమయములన్నియు జ్ఞాపకమువచ్చి మహోగ్రహోదగ్రమూర్తియై రథచక్రమెత్తుకొనుచున్న కర్ణునొకబాణముతో శిరశ్ఛేదముఁ జేసెను.

కర్ణార్జును లిటుపోరుచుండ భీముఁడర్జునునకు సాయముచేయ వచ్చుచుండెను. తోవలో దుశ్శాసనుఁడు వానికడ్డముచొచ్చెను భీముఁడతని గుఱ్ఱములఁగూల్చి సారథినిఁజంపి యాతనిం గ్రిందికిలాగెను వారిద్దఱుఁ గొంతవడిబోరిరి. దుశ్శాసనుఁడు క్రిందఁబడెను భీముఁడిదేసమయముగఁ దనకత్తితో వాని గుండెలలోఁబొడిచి, యావేడినెత్తుటిం ద్రావి వానితలనఱికెను. యుధిష్ఠిరుఁడు శల్యునిఁజంపెను. ఇటులఁ బ్రధానయోధులందఱుఁ జచ్చినంతఁ గౌరవసేన పఱువిడ మొదలుపెట్టెను. పాండవానీకము వారిని వెన్నంటి తఱుమెను. ఆసంకుల సంగ్రా

మమున నంద అన్నిదిశలకుఁ బాఱిరి. యుయుత్సుఁడను నొక డు తక్క దుర్యోధనుని తమ్ములందఱు నంతమొందిరి. దుర్యోధనుఁడు రణరంగము వదలి తలదాచుకొన బరుగెత్తెను. నాఁటి సంగ్రామమునఁ గౌరవబలము పదునొకండక్షౌహిణులలో నొకసైనికుఁడైన మిగులలేదు కృపకృతవర్మాశ్వత్థామలు మాత్రమే యుద్ధమున బ్రతికి నిలిచిరి.

# పదునారవ ప్రకరణము.

## దుర్యోధను నంత్యదశ.

రణరంగమునుండి పాఱి దుర్యోధనుఁ డొంటరిగఁ జాలదూరముపోయెను. ప్రాణము లెంతతీపిన! ఎప్పుడు నేనుఁగు నెక్కి కాని బయటికి రానివాఁడు పరిచారకులులేని దె కదలని వాఁడు వందిమాగధులులేక యుండనివాఁడు నగధీశుఁడని పించుకొనినవాఁడు నేఁడాపద్యోధనుఁడు క్షుద్రసర్పము మావపుఁగాంచి కలుగునఁ దూఱునట్లు మార్గమున ద్వైపాయన మను నొక మడువుఁ జూచి జలస్తంభవిద్యాశరణ్యుఁడై దాని లోదాగెను

దుర్యోధనునికొఱకుఁ బాండవు లెంతయు వెదకిరి ఎంత వెదకిన నతఁడు కన బడలేదు యుధిష్ఠిరుఁడు వాఁడెచ్చట నున్నదియుఁ గనుఁగొనినవారికిఁ బెద్దబహుమానమిచ్చెదనని చాటించెను.

